# జీవన్, హానుల విజ్ఞానానికి

# నోబెల్ బహుమతి



నోబెల్ సంస్థ, డైనమైట్‌ను కనిపెట్టిన స్వీడన్‌దేశపు రసాయన వేత్త ఆల్‌ఫ్రెడ్ బెర్న్‌హార్డ్ నోబెల్ చేత స్థాపించబడింది. ప్రతి సంవత్సరం ఆ సంస్థ నిధులను వివిధ రంగాలలో — అంటే భౌతిక శాస్త్రం, రసాయనిక శాస్త్రం, వైద్య, శరీర ధర్మ శాస్త్రాలు, సాహిత్యం, శాంతి, ఆర్థిక శాస్త్ర రంగాలలో రాణించిన వారికి బహుమతుల నియ్యడానికి వినియోగిస్తారు. ఆ సంస్థ ప్రధాన కార్యాలయం స్టాక్ హోంలో ఉంది. 1978 లో ప్రతి రంగానికీ ముందెన్నడూ లేనంత, 161,000 డాలర్ల బహుమతి, లభించింది.



మేరీ క్యూరీ (1867-1934) రెండుసార్లు నోబెల్ బహుమతి గెలిచిన ఒకే ఒక స్త్రీ — 1903 లో రేడియో ధార్మిక శక్తిగల ఒక మూలకాన్ని వేర్పరచినందుకు భౌతిక శాస్త్రంలోనూ, 1911 లో రేడియం, పొలోనియంలను కనుగొన్నందుకు రసాయన శాస్త్రంలోనూ.



నోబెల్ బహుమతి గ్రహీతలలో ప్రఖ్యాత భారతీయులు కొందరున్నారు. డా. సి. వి. రామన్‌కు, రామన్ ఎఫెక్ట్ అని తర్వాత పిలువబడిన, కాంతి — పదార్థాల శక్తి వినిమయం గురించిన ఆయన పరిశోధనకు, 1930 లో భౌతిక శాస్త్ర బహుమతి లభించింది. రవీంద్రనాథ్ టాగూరు (1861-1941) తన పద్య సంకలనం "గీతాంజలి" కి 1913 లో సాహిత్య బహుమతి గెలిచారు. ఈ బహుమతి గ్రహించిన మరొక ప్రసిద్ధ భారత మహిళ యుగోస్లావియాలో జన్మించిన మదర్ థెరెసా. ఆమెకు 1978 లో శాంతి బహుమతి లభించింది.





నోబెల్ బహుమతి మూడుసార్లు (1917, 1944, 1963) గెలిచిన ఒక సంస్థ అంతర్జాతీయ రెడ్‌క్రాస్. యుద్ధ సమయంలో ఆ సంస్థ గాయపడిన వారి సేవకు ప్రాముఖ్యమిచ్చింది. శాంతి సమయంలో ఆ సంస్థ కార్యకలాపాలు: ప్రథమ చికిత్స, రక్తపు బ్యాంకులు, ప్రమాద నివారణ మరి ఇతర మానవ సేవలు.







జీవిత భీమా అనేది భవిష్యత్తును కాపాడుకోవడానికి అతి క్షేమకరమైన, తెలివైన మార్గం. దాన్ని గురించి తెలుసుకోండి.



లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

వచ్చేసారి: జీవన్, హానుల ఆనందానికి కొన్ని ఉల్లాసకరమైన క్రీడలు.

daCunha-LIC-114 TL

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15

కేమెల్—2వ బహుమతి రు. 10

కేమెల్—3వ బహుమతి రు. 5

కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు

కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కల గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age ____________

Address ______________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 30-9-1981

**CONTEST NO 21**

VISION

# ఆ సమయమున మాధుర్యమునకు నెల్టా

నెల్టా చిన్నలు పెద్దలు ఇలా ఎవ రైనా రుచించవచ్చు. అది తన చవి సువాసనతో మీ కుటుంబములోనే గాక అన్నిచోటా పసరించును. మీ ఒక్కొక్కరి రుచులు గుణములు దానికి తెలుసును. అవి అనేక విధ ములలో లభిస్తున్నవి. స్యాండ్‌విచ్, పైనాపిల్, కార్డమమ్, కోకోనట్, ల్యాక్టో బాన్‌బాన్, ఆరెంజుక్యాండి, బటర్‌స్కాచ్ - ఇలాంటివి.



అందరితోనూ నెల్టాను పంచుకోండి. దానితో మీరు తప్పక మధురతనూ పంచుకొంటారు.

**Neltaa**

**SWEETS**



తయారించేవారు :
నెల్టా కన్‌ఫెక్షనరి వర్క్స్
32, ఎన్.ఎస్.బి. రోడ్డు,
తిరుచినాపల్లి-620 002
ఫోన్ : 24410

అసోసియేట్స్ :
గీతా సిల్క్స్ అండ్ స్యారీ బజార్
తిరుచినాపల్లి-620 002

జీవిత సుఖానుభవమునకు మధుర మైత్రి

MAPP/NS/M/114 Tel

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["తెలివైనవాడు"]కు ఆధారం "వసుంధర" రచన.

మామూలు వ్యక్తులకుండే మూఢవిశ్వాసాలు, యితరులకు అంతగా హానికలిగించకపోవచ్చు. కాని, రాజంతటివాడే వాటి ప్రభావానికిలోనైతే జరిగే కీడు, "మూఢవిశ్వాసం" అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

బృహస్పతేరపి ప్రాజ్ఞో, న విశ్వాసే వ్రజేన్నరః,
య ఇచ్ఛేదాత్మనో వృద్ధి, మాయుష్యం చ సుఖానిచ.

[తన క్షేమం, సుఖం కాపాడుకోదలచినవాడు, బృహస్పతి కన్న తెలివిగల వాడైనా సరే—ఇతరుల మాటలను తరచి చూడకుండా నమ్మరాదు.]

సంపుటి 69 సెప్టెంబర్ '81 సంచిక 3

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00





# అనుకున్నదొకటి!

అనంతయ్య చాలాసేపు తలుపు బాదాక, అతడి భార్య అరుంధతి ఆవులిస్తూ వచ్చి తలుపు తెరిచి, అరుగు మీది నుంచి ఆకాశం కేసి తొంగి చూస్తూ, "ఇంత అర్ధరాత్రి వచ్చావేమిటి?" అన్నది.

ఆ ఉదయమే అనంతయ్య పని మీద పొరుగూరు వెళుతూ, మర్నాటిగ్గాని రానని భార్యకు చెప్పాడు.

"పని త్వరగా తెమిలిపోయింది. సాయంత్రమే బాడుగబండిలో బయలుదేరాను. సగం దారిలో బండి బురదలో దిగబడిపోయింది, అక్కడి నుంచి నడిచి వచ్చేసరికి, యీ వేళయింది!" అంటూ అనంతయ్య విసుగ్గా లోపలికి వచ్చాడు.

అతను కాళ్ళు కడుక్కొంటూంటే అరుంధతి, "సాయంత్రం కనకయ్య పెళ్ళాం పెద్ద రచ్చచేసింది. మన పిల్లి వాళ్ళింట్లో పాలు తాగేసిందిట! నువ్వు వచ్చాక, కనకయ్యను పంపించి, నీ బుర్ర బద్దలు కొట్టిస్తుందిట," అన్నది.

అనంతయ్య ఇంటి వెనక వైపు కనకయ్య కుటుంబం వుంటున్నది. ఈ కుటుంబాల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

"కనకయ్య కోతలకేం గానీ, ముందు నాకు వడ్డన చెయ్యి," అన్నాడు అనంతయ్య.

అరుంధతి నాలుక కరుచుకున్నది. వండినవంట ఆమె మెతుకు మిగలకుండా తినేసింది. సమయానికి ఇంట్లో కూరలు కూడా ఏమీ లేవు.

ఆమె యీ సంగతి భర్తకు చెప్పి, "నువ్వు రాత్రికి తిరిగివస్తావని అనుకోలేదు. ఇప్పుడేం చెయ్యడం!" అన్నది.

ఆ మాటలు విని అనంతయ్య అగ్గి మీద గుగ్గిలం అయిపోయాడు. చాలా

మాచిరాజు కామేశ్వరరావు

దూరం నడిచి రావడంతో, అతడికి ఆకలి కరకరమంటున్నది.

"సోలెడు బియ్యం చప్పున వార్చి తగలేస్తేపోలా! ఏ ఊరగాయతో నో తినేస్తాను," అన్నాడు అనంతయ్య చిరాకు పడుతూ.

అరుంధతి తటపటాయిస్తూనే, "చిన్న జాడీలోకి తీసిన ఊరగాయ అయి పోయింది. పెద్ద ఊరగాయజాడీ అటక మీద వున్నది. దించాలంటే యీ చీకట్లో తేళ్ళూ, జెర్రులూ. పెరట్లో తోటకూర వుంది, కోసుకురా. ఈ లోపల నేను అన్నం వండుతాను," అన్నది.

విధిలేక అనంతయ్య విసుక్కుంటూ పెరట్లోకి వచ్చాడు. అక్కడ అంతా చీకటిమయం.

అతను అలవాటుగా తోటకూర మడి దగ్గిరకు వెళ్ళాడు. మడిలో అతని కాలి కింద ఏదో మెత్తగా నలిగింది. అనంతయ్య ఉలిక్కిపడి, పరీక్షగా చూస్తే అది పిల్లి పిల్ల!

నాలుగు రోజులక్రితమే అనంతయ్య వాళ్ళ పిల్లి నాలుగు కూనల్ని పెట్టింది. అందులో తెల్లపిల్ల అతడి కాలి కింద పడిందన్న మాట. అనంతయ్య దాన్ని కదిపిచూసి, చచ్చిపోయినట్టు తెలుసు కున్నాడు.



అతడికి ప్రాణం కడబట్టినంత పనైంది. పిల్లిని చంపినపాపం పట్టి పీడిస్తుంది! పాపపరిహారం కోసం చేయవలసిన తంతుతో ఇల్లు గుల్లయిపోతుంది. అరుంధతికి యిలాంటి వాటిల్లో పట్టింపులు జాస్తి. గుట్టు చప్పుడుకాకుండా మడిలోనే దాన్ని పాతిపెట్టి, గట్టిగా చెంపలు వేసు కుంటే, కొంతవరకు పాపపరిహారం అయి పోతుందనుకున్నాడు, అనంతయ్య.

అరుంధతి వంటగదిలో వున్నది. అనంతయ్య చప్పుడు కాకుండా తోటకూర మడిలో గునపంతో గొయ్యి తవ్వి, పిల్లి కూనను పాతిపెట్టి, తోటకూర కోసుకుని ఇంట్లోకి వెళ్ళిపోయాడు.



"తోటకూర కోయడానికి నీకు యింత సేపు పట్టింది; నేను మాత్రం వంట చిటికెలో చేసేయాలి!" అని భర్తను సాధిస్తూ, తోటకూర పులుసుకాచింది, అరుంధతి.

అయితే, ఆ రాత్రివేళ పెరట్లో ఏదో శబ్దమైతే చూడవచ్చిన కనకయ్య భార్య, చీకట్లో అనంతయ్య తోటకూర మడిలో తవ్వుతూండడం చూసి ఆశ్చర్యపోయి, యీ వార్త చెప్పేందుకు గదిలోకి వెళ్ళి భర్తను గట్టిగా తట్టి లేపింది.

"అర్ధరాత్రి ఏం కొంప మునిగిందని నిద్రలేపావు?" అంటూ కనకయ్య కళ్ళు తెరిచి, ఒళ్ళు విరుచుకోసాగాడు.

"లే, లే, మన కొంప నిండబోతున్నది. అనంతయ్య తోటకూర మడితవ్వి బంగారమో, డబ్బో దాచిపెట్టాడు. ఊళ్ళో దొంగలభయం జాస్తిగా వున్నది గదా! వాళ్ళు పడుకోగానే నువ్వు గుట్టుచప్పుడు కాకుండా గోడ దూకిపోయి, ఆ డబ్బు పట్టుకురా. ఈ విధంగా అయినా వాళ్ళకు మంచి శాస్తిచేయాలి," అన్నది కనకయ్య భార్య

డబ్బుమాట వింటూనే కనకయ్యకు పూర్తిగా నిద్రమత్తు వదిలిపోయింది. అనంతయ్య దాచింది తవ్వి తెచ్చుకోవడానికి అతను చిన్న పెట్టె తీసుకుని బయలుదేరాడు. గోడ దూకి అనంతయ్య తోటకూర మడిలో తవ్విన గుర్తు త్వరలోనే తెలుసుకున్నాడు. గునపంతో ఆ స్థలాన్ని తిరగదోడబోతున్న కనకయ్య కంఠానికి చల్లగా ఏదో తగిలింది. అతను ఉలిక్కిపడి తల ఎత్తి చూసేసరికి, పక్కనే నల్లటి దుస్తుల్లో భయంకరంగా వున్న దొంగ కనిపించాడు.

"కష్టపడి గొయ్యితవ్వి డబ్బు దాచడానికి అవస్థపడుతున్నావెందుకు? ఆ పెట్టె నా కిచ్చి, శుభ్రంగా చేతులు కడిగేసుకో!" అన్నాడు దొంగ కరుకుగా.

దొంగను చూసి కనకయ్యకు కాళ్ళూ, చేతులూ ఆడకపోయినా బుర్ర మాత్రం

చురుగ్గానే పని చేస్తున్నది. దొంగ, యీ ఇల్లు తనదనీ, తాను డబ్బు పాతిపెట్ట బోతున్నాననీ అనుకుంటున్నాడు. ఈ అవ కాశం ఉపయోగించుకుని దొంగ చేత అనంతయ్య ఇల్లు దోయించాలను కున్నాడు, కనకయ్య.

అతను మూత తెరిచి, ఖాళీపెట్టెను దొంగకు చూపుతూ, "నా భార్య, యీ పెట్టె పట్టేంత గుంట తవ్వమన్నది, తన నగలన్నీ తెచ్చి యిందులో వేస్తుందట! పోయి తలుపు తట్టి, ఆమెను పిలిచి, గొడవ చెయ్యకుండా ఆ నగలేవో పట్టుకుపో. నన్ను మాత్రం ఏమీ చెయ్యకు," అన్నాడు.

"నా గొంతు వింటే తలుపు తెరుస్తుందా? నీ పెళ్ళాన్ని నువ్వే పిలువు. ఆవిడ బయటికి వచ్చాక, ఆ నగల సంగతేమిటో నేనే చూసుకుంటాను," అంటూ దొంగ కనకయ్య మెడ పట్టుకుని, అతణ్ణి అనంతయ్య పెరటిగుమ్మం దగ్గిరకు లాక్కుపోయాడు.

ఇప్పుడు కనకయ్యకు దొంగభయం పోయి మహా సంతోషంగావుంది. అతను పెద్దగా గొంతెత్తి, "అరుంధతీ, త్వరగా రా!" అంటూ కేక పెట్టాడు.

తలుపు తెరవగానే అతను భార్యకు ఏమైనా సైగలు చేస్తాడేమో అని అను



మానించి దొంగ, కనకయ్యను పెడగాతోసి, తాను తలుపు దగ్గిరగా నిలబడ్డాడు. కనకయ్య మరొకసారి, అరుంధతీ అంటూ గట్టిగా కేక వేశాడు.

ఆ కేకకు అరుంధతికి మెలకువ రాలేదు గాని, అనంతయ్య నిద్రలేచాడు. అర్ధరాత్రి ఎవరో కేక వెయ్యడం విని, అతడికి పట్టరాని కోపం వచ్చింది. హఠాత్తుగా అతడికి కనకయ్య భార్య తన భర్తచేత బుర్ర బద్దలు కొట్టిస్తానన్న మాట కూడా గుర్తుకు వచ్చింది.

అనంతయ్య పళ్ళు కొరుకుతూ దుడ్డు కర్ర తీసుకుని చప్పుడుకాకుండా పెరటి తలుపు తెరిచి, ఏం జరగబోతున్నదో

దొంగ ఊహించేలోపలే, అతణ్ణి కనకయ్య అనుకుని దుడ్డుకర్రతో తలమీద బలంగా కొట్టాడు.

దొంగ కుయ్యిమని కూడా అనకుండా కుప్పకూలిపోయాడు.

కనకయ్య ఆ దెబ్బ తన నెత్తిన పడి నంతగా అదిరిపడ్డాడు. కోపం వస్తే అనంతయ్య ఎంతటి సాహసానికైనా వెను దీయడని అతడికి తెలిసిపోయింది. అలాంటి వాడితో గిల్లికజ్జాలకన్నా, స్నేహంగా వుండడం తనకు క్షేమం.

కనకయ్య యిలా ఆలోచించి, లేని సంతోషాన్ని కనబరుస్తూ, "బేష్, అనం తయ్యా! గజదొంగ అంతటివాణ్ణి, ఒక్క దెబ్బతో మట్టికరిపించావు. నీకు గ్రామాధి కారి నుంచి పెద్ద బహుమానం రాక మానదు," అన్నాడు.

అనంతయ్య యీసారి దుడ్డుకర్రను కనకయ్య కేసి గురిచేసి, "ఈ వెకిలి కబుర్లు అలా వుంచు. ముందు నేనడిగే దానికి జవాబు చెప్పు. నువ్వేనే యీ గజ దొంగ వెంట, నా పెరట్లోకి ఎందుకు వచ్చావు?" అని అడిగాడు.

కనకయ్య వణికిపోతూ, జరిగినదంతా అనంతయ్యకు చెప్పి, "ఇలా ఎందుకు చేశావని అడక్కు; దీన్నే బుద్ధిగడ్డితినడం అంటారు! నన్ను క్షమించు. ఈనాటి నుంచీ పాతరోజులు మర్చిపోదాం," అన్నాడు.

కనకయ్య అన్నట్టుగానే పెద్ద గజ దొంగను పట్టినందుకు అనంతయ్యకు గ్రామాధికారి నుంచి వందవరహాల బహు మానం లభించింది.

ఈ జరిగిన గొడవంతా భర్త చెప్పగా విన్న అరుంధతి నవ్వి, "ఆ పిల్లిపిల్ల ఏదో జబ్బుతో సాయంత్రమే చచ్చి పోయింది. తెల్లవారి పనిమనిషిచేత గొయ్యి తవ్వించి పాతిద్దాం అనుకున్నాను. దాని వల్లనే నీకు బహుమానం దక్కింది. శత్రువు, మిత్రుడయ్యాడు. మరి, చచ్చిన పిల్లిని ఖననం చేసిన పుణ్యం ఉట్టినే పోతుందా!" అన్నది.






## 17

[శాక్తేయుడి మహత్తుగల త్రిశూలం, శిథిలనగరంలోని ఏనుగులవనంలో వున్నదని సమర సేనుడు తెలుసుకున్నాడు. వ్యాఘ్రదత్తుడు అతడి మీద దాడిచేసి, బందీగా పట్టుకున్నాడు. ఆ సమయంలో శివదత్తుడు అక్కడికి వస్తున్నాడని తన అనుచరుల ద్వారా తెలుసుకుని, వ్యాఘ్రదత్తుడు బందీ అయిన సమరసేనుడితో పాటు పారిపోసాగాడు. తరవాత—]

శివదత్తుడు తన అనుచరులతో శిథిల నగరం ప్రవేశించాడని తెలియడం సమర సేనుడికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. అతడే గనక కొంచెం ముందుగా వచ్చి వున్నట్టయితే, వ్యాఘ్రదత్తుణ్ణి, సంహరించి శాక్తేయుడి త్రిశూలాన్ని తనదిగా చేసుకుని వుండేవాడు.

వ్యాఘ్రదత్తుడు తనను ఏమి చేయాలనుకుంటున్నదీ సమరసేనుడు ఊహించలేక పోయాడు. తనను చంపేందుకు వ్యాఘ్రదత్తుడికి మరే ఆటంకమూ లేదు. ఈ ఆపత్సమయంలో చతుర్నేత్రుడు అక్కడికి వస్తే ఎంత బావుండును, అనుకున్నాడు సమరసేనుడు.

ఇప్పుడు వ్యాఘ్రదత్తుడికి తాను ప్రమాదంలో చిక్కుకున్నాననే భయం కలగసాగింది. శివదత్తుడికి శాక్తేయుడి త్రిశూలం ఎక్కడవున్నదీ తెలుసునా?




అన్నది ఒక సంశయం. సమరసేనుడు తనకు చతుర్నేత్రుడు మిత్రుడని చెప్పిన దాంట్లో వున్న నిజం ఎంత? అన్న అనుమానం ఒకటి.

ఏది ఏమైనా ప్రస్తుతానికి సమరసేనుణ్ణి చంపటం తనకు క్షేమం కాదని నిర్ణయించుకున్నాడు, వ్యాఘ్రదత్తుడు. వీలయితే తను సమరసేనుడితో స్నేహం నటించి బలవంతుడైన శివదత్తుణ్ణి ముందు హతమార్చటం, అన్ని విధాలా చేయదగిన పనిగా, ఆ సమయంలో అతడికి తోచింది.

వ్యాఘ్రదత్తుడితో పాటు అందరూ కొండ మార్గాన గల ఎత్తుపల్లాల్లోంచి పరిగెత్తుతున్నారు. శివదత్తుడి అనుచరులతో, తన భటులు యింకా పోరాడుతున్నారనే సూచనగా, వాళ్ళ కేకలు వినబడుతూండటం, వ్యాఘ్రదత్తుడికి కొంత ధైర్య కారణంగా వున్నది.

''సమరసేనా, యిక్కడ మనం కొంచెం విశ్రాంతి తీసుకోవచ్చు. శత్రువుల నుంచి మనం చాలా దూరం వచ్చేశాం. ఇక భయంలేదు,'' అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

సమరసేనుడికి యీ మాటలు చాలా ఆశ్చర్యం కలిగించినై. వ్యాఘ్రదత్తుడు బందీఅయిన తనను మిత్రుడుగా, తనకు మిత్రుడైన శివదత్తుణ్ణి శత్రువుగా చేసి మాట్లాడుతున్నాడు.

''శివదత్తుడు మొదటి నుంచీ నాకు స్నేహితుడు. అతణ్ణి గురించి భయపడవలసింది నువ్వు కాని, నేను కాదు,'' అన్నాడు సమరసేనుడు.

పరిగెత్తటం వల్ల బాగా అలసిపోయిన వ్యాఘ్రదత్తుడు ఒక చెట్టుకు ఆనుకుని కూర్చుంటూ, సమరసేనుడన్న మాటలకు నిర్విణ్ణుడైపోయాడు. అతడు వెంటనే జవాబిచ్చేందుకు సంశయించాడు. సమరసేనుణ్ణి ఏ విధంగా అయినా సరే, తన పక్షం చేసుకోవటం మేలన్న భావం అతడికి కలిగింది.

''సమరసేనా, నీకు శివదత్తుణ్ణి గురించి అంతగా తెలిసినట్టులేదు. అది అట్లా

వుంచుదాం. పోతే, మనిద్దరం విరోధులుగా వున్నందువల్ల, యిద్దరమూ నష్టపడవలసి వస్తుంది. ఇదుగో, నిన్ను బంధవిముక్తుణ్ణి చేస్తున్నాను. తరవాత మిత్రులుగా మనం అన్ని సంగతులూ మాట్లాడుకోవచ్చు.'' అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

వ్యాఘ్రదత్తుడి అజ్ఞ కాగానే యిద్దరు భటులు సమరసేనుడి చేతులకు కట్టి వున్న తాళ్ళను విప్పేశారు. సమరసేనుడు కూడా తనున్న సంకటస్థితిలో, వ్యాఘ్రదత్తుణ్ణి ఏదో విధంగా మంచి మాటలతో సంతృప్తిపరచటమే తనకు క్షేమమని నిశ్చయించుకున్నాడు.

''శాక్తేయుడి అపూర్వశక్తులు గల త్రిశూలాన్ని గురించి మనిద్దరికీ తెలుసు. అది ఎక్కడున్నదీ, దాన్ని చేతబట్టిన వాళ్ళకు వశమయ్యే భోగభాగ్యాల సంగతి కూడా మనిద్దరికీ తెలుసు. కాని, తక్షణం యీ భయంకరద్వీపంలో దానివల్ల నువ్వు పొందగోరే లాభమేమిటో చెప్పగలవా ?'' అని అడిగాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు ఆ ప్రశ్న వింటూనే వెలవెలపోయాడు. ఒకవేళ ధనరాసులతో వున్న నావ సంగతి సమరసేనుడికి తెలియదేమో అన్న అనుమానం అతడికక్కలిగింది. కాని, వెంటనే అతడికి సమరసేనుడు యీ ద్వీపానికి ఎందుకు వచ్చాడో గుర్తు వచ్చింది. ఆ నావలోని ధనరాసుల కోసమేగదా యితను యిన్ని అవస్థలు పడుతున్నాడు, అనుకున్నాడు. అందువల్ల





ఆ నావను గురించి చెప్పినందువల్ల కలగ బోయే నష్టం ఏమీ లేదనుకున్నాడు.

"సమరసేనా, మనిద్దరికీ సముద్రంలో ధనరాసులతో నిండివున్న నావను గురించి తెలుసు. ఇందులో మనం ఒకళ్ళనొకళ్ళం మోసగించుకోగలిగిందేమీ లేదు. పోతే, యీ సమయంలో నేనొక సంగతి చెప్ప దలిచాను. ఆ నావలోని ధనరాసులను చెరిసగం పంచుకుందాం. ఇందుకు నీకెలాంటి అభ్యంతరం లేదుగదా?" అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

"మన యిష్టాయిష్టాల మాట అటుంచి, ముందు ఆ మాంత్రికుల సంగతేమిటి?" అన్నాడు సమరసేనుడు నవ్వుతూ.

"ఒకసారి ఆ శాక్తేయుడి త్రిశూలం చేజిక్కించుకున్న తరవాత మనను యీ లోకంలో ఏ శక్తీ ఎదిరించలేదు గదా!" అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

ఈ జవాబుకు సమరసేనుడు బిగ్గరగా నవ్వాడు. వ్యాఘ్రదత్తుడు దానికి కారణం అర్థంకాక ఆశ్చర్యపడుతూ సమరసేనుడి కేసి అనుమానంగా చూశాడు.

"ఆ శాక్తేయుడి త్రిశూలం యీ నిమిషాన శివదత్తుడి చేతుల్లోకి పోయే అవకాశం వున్నది. ఆ సంగతి గ్రహించావా?" అన్నాడు సమరసేనుడు.

"శివదత్తుడికి శాక్తేయుడి త్రిశూలం దాచివున్న ఆ ప్రత్యేకస్థలం సంగతి తెలియదు. పైగా నా భటులందర్నీ హత మార్చిందే, అతడు చేయగలిగింది కూడా ఏమీ లేదు. త్రిశూలం దాచివున్న చోటు గుర్తుపెట్టబడిన పటం నా దగ్గిర వున్నది. 'ఏనుగుల వనంలోని విషవృక్షం' అన్నంత మాత్రాన, పటంలోని గుర్తుల సాయం లేకుండా ఎవరూ దానిని వెతికి పట్టుకో లేరు." అన్నాడు వ్యాఘ్రదత్తుడు ధీమాగా.

వ్యాఘ్రదత్తుడు మాట ముగించీ ముగించక ముందే, ఆ ప్రదేశమంతా మార్మోగే టట్టు ఏకాక్షి మాంత్రికుడి వేగు కపాలుడి కఠోరస్వరం వినబడింది. ఆ శబ్దం వింటూనే సమరసేనుడు లేచి నిల

బడ్డాడు. వ్యాఘ్రదత్తుడూ, అతడి వెంట వున్న భటులూ భయకంపితులై దిక్కులు చూడసాగారు.

''ఇది చతుర్నేత్రుడి వేగు కపాలుడు! మీరు వెంటనే పారిపోయి, దూరంగా వున్న ఏ గుహలో అయినా దాక్కోవటం క్షేమం,'' అన్నాడు సమరసేనుడు.

వ్యాఘ్రదత్తుడు అనుమానంగా అతడి కేసి చూస్తూ, ''చతుర్నేత్రుడు నీ స్నేహితుడని చెప్పావు గదా? అలాంటప్పుడు భయమెందుకు?'' అని అడిగాడు.

సమరసేనుడు యిక ఆలసిస్తే తనకు ప్రమాదమని గ్రహించాడు. కపాలుడు ఏకాక్షమాంత్రికుడి వేగు! మంత్రవేత్త అయిన చతుర్నేత్రుడికి, అంతబలవంతుడైన మరొక శత్రువు ఏకాక్ష అనేవాడు వున్నాడని వ్యాఘ్రదత్తుడికి తెలియటం ప్రమాదమనే సమరసేనుడు ఆ విధంగా వ్యాఘ్రదత్తుడితో అబద్ధం చెప్పాడు.

''మీరు చతుర్నేత్రుడి కంటబడటం అంత క్షేమంకాదు. ముందుగా నేనతనితో మాట్లాడిన తరవాత, మీకు అతడితో పరిచయం కలిగిస్తాను. ఇదంతా మీ మంచికే చెబుతున్నాను. మీరు వెంటనే ఏ గుహలో అయినా తలదాచుకోవటం ఉత్తమం,'' అన్నాడు సమరసేనుడు ఆదుర్దా నటిస్తూ.



సమరసేనుడు యిలా అంటూండగానే, ''కపాలా! కాలభుజంగా!'' అంటూ ఏకాక్ష కంఠం భయంకరంగా ధ్వనించింది. ఆ ధ్వనికి నివ్వెరపోయిన వ్యాఘ్రదత్తుడూ అతడి భటులూ అక్కడినుంచి పరిగెత్త సాగారు. అదే అదనుగా భావించి సమరసేనుడు కూడా మరో వైపుకు పరిగెత్త సాగాడు.

కొంతదూరం పరిగెత్తి వెనక్కు తిరిగి చూసిన వ్యాఘ్రదత్తుడికి, సమరసేనుడు కూడా పారిపోతూ వుండటం, అనుమానం కలిగించింది. తన స్నేహితుడని చెప్పిన చతుర్నేత్రుడి నుంచి, అతడెందుకు పారిపోవాలి? అన్న సంశయం కలిగింది.

ఇందులో ఏదో మోసం వున్నదను కున్నాడు, వ్యాఘ్రదత్తుడు.

వ్యాఘ్రదత్తుడు యిలా ఆలోచిస్తున్నంతలో ఏకాక్ష మాంత్రికుడు అక్కడికి రానే వచ్చాడు. అతడిదృష్టి వ్యాఘ్రదత్తుడి మీద పడింది. అతడు కోపంగా పళ్ళు కొరుకుతూ, "కపాలా! కాలభుజంగా! చతుర్నేత్రుడి భృత్యుల్ని చుట్టుముట్టండి. వీళ్ళను నిలువునా నరకబోతున్నాను," అన్నాడు భీకరంగా.

వ్యాఘ్రదత్తుడికి అసరికి పరిస్థితి అర్థమైపోయింది. ఈ వచ్చిన మాంత్రికుడు సమరసేనుడి స్నేహితుడైన చతుర్నేత్రుడు కాదు. తనను మోసగించి సమరసేనుడు పారిపోయాడు. ఇప్పుడు చేయవలసిందేమిటి? ఏదో విధంగా యీ మాంత్రికుడికి తను చతుర్నేత్రుడి అనుచరుణ్ణి కాదనీ, అతని శత్రుపక్షంలోని వాడిననీ నచ్చచెప్పాలి!

ఏకాక్ష ఆజ్ఞ వింటూనే అతడి వేగులైన కపాలమూ, కాలభుజంగమూ వ్యాఘ్రదత్తుణ్ణీ, అతడి భటుల్నీ చుట్టు ముట్టినై. కాలభుజంగం కోరలు చాచి బుసలు కొడుతూ వాళ్ళ చుట్టూ తిరగసాగింది. కపాలం వాళ్ళ తలల మీద ఎగురుతూ, గుండెలదిరేటట్టు వికృతంగా అరవసాగింది.




ఏకాక్ష హహ్హహ్హ అని నవ్వుతూ వాళ్లను సమీపించాడు. అంతలోనే అతడి వికృతమైన నవ్వు ఆగిపోయింది. అతడు భావించినట్టు తన చేత చిక్కినవాళ్ళు సమరసేనుడూ, అతడి సైనికులూ కారని గ్రహించాడు.

"మీరెవరు? కుంభాండుడి అనుచరులా?" అని అడిగాడు ఏకాక్ష, ఆశ్చర్యంగా చూస్తూ.

వ్యాఘ్రదత్తుడు నిలువెల్లా వణికిపోసాగాడు. అతడికి కుంభాండు డెవరో తెలియదు.

"నా పేరు వ్యాఘ్రదత్తుడు. నేనీ వ్యాఘ్రమండలానికి రాజును. తమరనే

కుంభాండు డెవరో నాకు తెలియదు,'' అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

''అయితే, నీవీ మృత్యులోయకు అద్దరి నుంచి వచ్చిన వాడివి కాదన్న మాట?'' అన్నాడు ఏకాక్ష.

''మీరు చెబుతున్న ఆ మృత్యులోయ ఎక్కడ వున్నదో కూడా నాకు తెలియదు. బహుశా ఆ లోయను మేము మరొక పేరుతో పిలుస్తూండవచ్చు.'' అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

''అయితే, సమరసేనుడు అన్న పేరు గల వాణ్ణెవణ్ణయినా ఎరుగుదువా?'' అని ప్రశ్నించాడు ఏకాక్ష.

ఏకాక్ష అలా ప్రశ్నించేసరికి, వ్యాఘ్రదత్తుడికి పరిస్థితి అంతా అర్థమైపోయింది. ఏకాక్ష మాంత్రికుడు, సమరసేనుడికి ప్రబలవిరోధి! ఇది, సమరసేనుడి మీద పగ తీర్చుకునేందుకు మంచి అవకాశంగా వ్యాఘ్రదత్తుడికి తోచింది.

''మాంత్రిక మహాశయా! ఆ సమరసేనుడు రెండు, మూడు ఘడియలకు ముందు, నా నుంచి తప్పించుకుని పారిపోయాడు. అతడు నాకు బద్ధవిరోధి. అతణ్ణి లోగడ బందీగా పట్టుకున్నాను కూడా,'' అన్నాడు వ్యాఘ్రదత్తుడు.

వ్యాఘ్రదత్తుడిలా చెప్పేసరికి, ఏకాక్షికి కూడా పరిస్థితి అవగాహన అయింది. సమరసేనుణ్ణి వెతికి పట్టాలంటే, అందుకు వ్యాఘ్రదత్తుడు సాయం చేయగలడని అతడు భావించాడు. కాని, సమరసేనుడికీ, వ్యాఘ్రదత్తుడికీ విరోధ కారణం ఏమిటో ముందు తెలుసుకోవాలనుకున్నాడు.

''మీ యిద్దరి మధ్యా విరోధం ఎందుకు కలిగింది? అతడు నీకు ఖైదీగా చిక్కి ఎలా పారిపోగలిగాడు?'' అని అడిగాడు ఏకాక్షి

''తమరు సర్వజ్ఞులు! నేను కొత్తగా చెప్పవలసిందేముంది?'' అంటూ వ్యాఘ్రదత్తుడు, ఏకాక్షికి రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

—(వచ్చే సంచికలో ముగింపు)






# తెలివైనవాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఎవరికోసం యింతగా శ్రమలపాలవు తున్నావో తెలియదు. ధనసంపాదన విషయంలో మనుషుల మధ్య విపరీత మైన పోటీలు జరగడం, శత్రువులు కావడం ఆశ్చర్యంకాదు. కాని తెలివి తేటల్లో ఎవరు మిన్న అనే సమస్య కారణంగా శత్రువులైన యిద్దరి వింతకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

కోసలదేశం లోని మాతంగనగరం సుప్రసిద్ధమైన వర్తకకేంద్రం. ఆనగరంలో సుధాకరు డనే వర్తక ప్రముఖుడుండే వాడు. తెలివితేటల్లో ఎవరైనా ఆయన

## బేతాళ కథలు



వద్ద భారీ ఎత్తున సుగంధద్రవ్యాలు కొనుక్కుని వెళ్ళేవారు.

ఈ వర్తకుల వల్ల సుధాకరుడికి రెండు విధాలుగా గిట్టుబాటయేది; ఒకేసారి ఎక్కువ సరుకు అమ్ముడు కావడమూ, అధిక లాభాలూ!

ఈ సంవత్సరం ఆ పెద్ద బేరాన్ని ఎలాగైనాసరే తను సంపాయించాలన్న దృఢనిశ్చయంలో వున్నాడు, సారంగుడు. సుధాకరుడి కంటె తక్కువ ధర చెప్పి, పెద్ద ఎత్తున ఎక్కువ సరుకు అమ్ముకోవాలనుకున్నాడతను. కొద్ది రోజుల్లోనే అరబ్బీ వర్తకులు వస్తున్నట్టు అతడికి వార్త అందింది.

తర్వాతనే అని చెప్పుకునేవారు. ఆయనది సుగంధద్రవ్యాల వ్యాపారం. నగరంలో ఆయనొక్కడే, యీ వ్యాపారం చేసేవాడు.

ఇలా వుండగా, ఆ నగరానికి సారంగుడనే వాడు వచ్చి, సుగంధద్రవ్యాల వ్యాపారం ప్రారంభించి, కొద్దికాలంలోనే మంచి లాభాలు సంపాయించాడు. ఇతడి పోటీ మూలంగా సుధాకరుడి వ్యాపారం కొద్దిగా దెబ్బతిన్నది. అయితే సుధాకరుడు మాత్రం ఎన్నడూ సారంగుడిని లెక్క చేయలేదు. అతడితో పరిచయానిక్కూడా ప్రయత్నించలేదు.

ప్రతి సంవత్సరం అరబ్బుదేశాల నుంచి కొందరు వర్తకులు వచ్చి, సుధాకరుడి

ఒక రోజున వృద్ధుడొకడు సారంగుణ్ణి కలుసుకుని, "నీ మేలుకోరి చెబుతున్నాను, సుధాకరుడితో పోటీపడి, నువ్వు సుగంధద్రవ్యాల ధర తగ్గించకు. అందువల్ల నువ్వూ, సుధాకరుడే కాక, మన దేశం కూడా నష్టపోతుంది. సుధాకరుడు మంచి మనిషి. మీరిద్దరూ కలిసి మాట్లాడుకుని, వచ్చే అరబ్బు వర్తకులకు చెరి సగం సరుకు అమ్మడం, ఇద్దరికీ శ్రేయస్కరం," అన్నాడు.

సారంగుడు నవ్వి, "నిన్ను సుధాకరుడు పంపాడా? ఆయనకు తన తెలివితేటల మీద గురి తప్పి, నా తెలివి

తేటలకు భయపడుతున్నాడన్నమాట!'' అన్నాడు

ఆ జవాబుకు వృద్ధుడు శాంతంగా, ''వెర్రివాడా, తెలివితేటల్లో సుధాకరుడికి సాటి వచ్చేవాళ్ళెవరూ లేరు. ఒకవేళ, నీ మూలంగా అరబ్బీ వర్తకుల బేరం ఆయనకు దక్కలేదనుకో, అప్పుడు కూడా జనం నీ తెలివితేటలను మెచ్చుకోరు. సుధాకరుడు తనకుతానై నిన్ను మెచ్చుకుంటే తప్ప, ఈ నగరంలోని వారెవ్వరూ నీ తెలివితేటల్ని గుర్తించరు,'' అన్నాడు.

సుధాకరుడికి ఆ నగరంలో వున్న పేరు ప్రఖ్యాతుల్ని గురించి, సారంగుడికి తెలుసు. సారంగుడికి తాను చాలా తెలివైనవాడినని గట్టినమ్మకం సుధాకరుడి కంటే గొప్పవాడిననిపించుకోవడం కోసమే, అతడు సుగంధద్రవ్యాల వ్యాపారం ప్రారంభించాడు.

''ఏం చేస్తే నన్ను, ఆ సుధాకరుడు తెలివైనవాడినని ఒప్పుకుంటాడు?'' అని అడిగాడు సారంగుడు వృద్ధుణ్ణి.

''ఎంత తెలివిగలవాడైనా, సుధాకరుడికి చేతకాని పనులు కూడా వున్నాయి. అవి చేసినవాడిని ఆయన మెచ్చుకోగలడని అంటారు. నువు ఒకసారి ఆయనను కలుసుకుని మాట్లాడరాదా?'' అన్నాడు వృద్ధుడు.

కుతూహలం కొద్ది సారంగుడు, సుధాకరుణ్ణి కలుసుకుని, ''తెలివితేటల్లో మీరెక్కువో, నేనెక్కువో తెలుసుకోవాలను





కుంటున్నాను. మీరు చేయలేని పనేదైనా వుంటే చెప్పండి, నేను చేస్తాను,'' అన్నాడు.

సుధాకరుడు, సారంగుణ్ణి ఆప్యాయంగా ఆదరించి, ''నేను చేయలేని పనులు చాలా వున్నవి. వాటిలో కొన్ని నువ్వు చేయగలవు. అయితే నేనూ, నువ్వూ కూడా చేయలేని పని ఒకటుంది. అది, స్రవంతీనగరంలోని ముత్యగుప్తుడి యింటి నుంచి పచ్చలహారం తీసుకు రావడం,'' అన్నాడు.

''తీసుకురావడమంటే ఎలా? కొని తేవచ్చా లేక దొంగతనం చేయాలా?'' అని అడిగాడు సారంగుడు.

''ఎలాగైనా నాకు అభ్యంతరం లేదు,'' అన్నాడు సుధాకరుడు.

ఆ పచ్చలహారం తెస్తానని బయల్దేరాడు, సారంగుడు. రెండు రోజుల ప్రయాణం తరవాత అతడు స్రవంతీనగరం చేరాడు. అక్కడి ప్రముఖ వర్తకుల్ని ఎందరిని అడిగినా, వాళ్ళు ముత్యగుప్తుడి ఆచూకీ చెప్పలేకపోయారు. చివరకు ఒక వర్తకుడు సారంగుడు, సుధాకరుడు పంపగా వచ్చాడని తెలుసుకుని, ''ముత్యగుప్తుడనే ఒక మనిషి శివాలయం పక్క ఇంటిలో వుంటున్నాడు. అతడు సుధాకరుడికి దూరపు బంధువనుకుంటాను,'' అన్నాడు.

సారంగుడు ముత్యగుప్తుడి ఇంటికి వెళ్ళి నిరాశ చెందాడు. ఆ ఇంట దారిద్ర్యం విలయతాండవం చేస్తున్నది. అటువంటి చోట పచ్చలహారం ఎలా దొరుకుతుంది?

''నాకు అయినవాళ్ళంతా, ఉన్నవాళ్లే! కానీ, నేను విరాగిని. అక్కడా, యిక్కడా భోజనం చేసి, పడుకునేందుకు ఇంటికి వస్తుంటాను,'' అన్నాడు ముత్యగుప్తుడు.

సారంగుడు ఆయన్ని పచ్చలహారం గురించి అడిగాడు.

''ఈ ఇంట్లో నీకు ఏది కావాలన్నా తీసుకుపో, నా అభ్యంతరం లేదు,'' అన్నాడు ముత్యగుప్తుడు.

సారంగుడు నగరంలో రెండు రోజులు గడిపి, ముత్యగుప్తుడి వద్ద పచ్చలహారం లేదనీ, అతడు దాన్ని ఎక్కడా దాచలేదనీ రూఢిచేసుకున్నాడు. అతడు చిరాకు పడుతూ తిరుగుప్రయాణమై, రెండు రోజుల్లో మాతంగనగరం చేరుకుని, సుధాకరుడి దగ్గిరకు పోయి, "మీరు, నాకు అబద్ధం చెప్పారు. ముత్యగుప్తుడు కటిక దరిద్రుడు. అతడి దగ్గిర పచ్చల హారం కాదుగదా, రుద్రాక్షమాల కూడా లేదు. లేని వస్తువును నేనెలా తెచ్చేది?" అన్నాడు.

"నేను అబద్ధం ఆడలేదు. ముత్యగుప్తుడి ఇంటి నుంచి పచ్చలహారం తీసుకు రమ్మన్నాను గానీ, అతడికి పచ్చల హారం వున్నదని నేను చెప్పలేదు గదా?" అన్నాడు సుధాకరుడు.

"లేని వస్తువును తీసుకురావడం ఎంత తెలివైనవారికీ సాధ్యపడదని మీకు తెలియదా?" అన్నాడు సారంగుడు.

"తెలుసు. కానీ, నాకు సాధ్యపడని పని చెయ్యాలని నువ్వు కుతూహల పడుతూంటే, చెప్పాను. అంతే!" అన్నాడు సుధాకరుడు.

"మీ చమత్కారంతో ఎంతో విలువైన నా కాలాన్ని వృధా చేశారు, అనవసరంగా," అన్నాడు సారంగుడు.



"నీ కాలం వృధాచేసిన మాట నిజమే. కానీ అనవసరంగా అని మాత్రం అనకు! నువ్విక్కడ లేని సమయంలో, అరబ్బీ వర్తకులతో నా వ్యాపారం పూర్తయింది గదా," అన్నాడు సుధాకరుడు.

సారంగుడు రెండు చేతులతో తల పట్టుకుని, "మీ తెలివితేటలు అమోఘం! నేను చిత్తుగా ఓడిపోయాను," అన్నాడు.

"తెలివితేటల సంగతి ఎలా వున్నా కావాలనుకుంటే నేను చెయ్యలేని పని, నువ్వు యిప్పుడే చెయ్యగలవు," అన్నాడు సుధాకరుడు నవ్వుతూ.

"ఏమిటది?" అన్నాడు సారంగుడు ఆశ్చర్యపోతూ.

"నా కూతుర్ని పెళ్ళిచేసుకోవడం!'' అన్నాడు సుధాకరుడు.

ఈ మాటలకు సారంగుడు మరింతగా ఆశ్చర్యపోయాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, '' రాజా, సుధాకరుడు అన్నట్టు నిజంగానే సారంగుడు అయనకన్న తెలివైనవాడైతే, పచ్చల హారం పేరుతో సుధాకరుడు పన్నినవలలో, ఎందుకు పడ్డాడు? దాన్ని ముందుగానే ఎందుకు గ్రహించలేకపోయాడు? అటువంటివాణ్ణి అల్లుడుగా చేసుకో చూడడం, తెలివితక్కువతనం అనిపించుకోదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సుధాకరుడు, సారంగుణ్ణి తన అల్లుడుగా చేసుకోదలచడంలో, చాలా వివేకం కనబరిచాడన్న దాంట్లో సందేహం లేదు. తెలివితేటల్లో సారంగుడు తనకేమీ తీసిపోడని గ్రహించడం వల్లనే, సుధాకరుడు పచ్చలహారం మిషతో అతణ్ణి నగరం వదిలేలా చేశాడు. అటువంటి యువకుడు తన అల్లుడైతే, వ్యాపారాన్ని మరింత సమర్థవంతంగా నడుపుతూ, తన తదనంతరం కూడా, అది తన కుటుంబీకులకే స్థిరపడేలా చేయగలడని, సుధాకరుడి నమ్మకం. ఇక సారంగుడిలో వున్న ముఖ్యమైన లోపం మాట! ఎవరైనా సరే తన తెలివితేటల్ని, తన బతుకుతెరువుకు ఉపయోగించుకున్నంత కాలం నష్టంలేదు. కాని, ఎదుటివాడికన్న అధికుణ్ణనిపించుకోవాలన్న ఆశ పుట్టినప్పుడే, మనిషి తెలివితేటలు నశించి, తప్పటడుగు వేస్తాడు. తెలివైనవాడెప్పుడూ కార్యసాధనకే తప్ప, యితర్లపై ఆధిక్యత కోసం ప్రయత్నించకూడదు. సారంగుడు యిలాంటి పొరబాటు చెయ్యడం వల్లనే, సుధాకరుడి చేతిలో ఓడిపోయాడు,' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మూఢ విశ్వాసం

యువకుడైన రాజా విక్రమసింహుడు, తన సామంతరాజు వీరకేతుడి కుమార్తె గీతాంజలి అందచందాలను గురించి విని, ఆమెను వివాహమాడాడు.

ఒకనాడు విక్రమసింహుడి బావమరిది సుకేతుడు వచ్చి, ఏడు విలువగల రత్నాలను బహూకరించాడు. అలా బావమరిది తనకు ఏడు రత్నాలను బహూకరించడం, తనకు కీడు కోరడం వల్లనే అని, పట్టరాని కోపంతో విక్రమసింహుడు అతణ్ణి ఖైదులో పెట్టించాడు.

విక్రమసింహుడికి కొన్ని మూఢవిశ్వాసాలున్నాయి. ఏడు సంఖ్య అంటే అతడికి తగని భయం. అతడికి ఏడవఏట జలగండం తప్పింది. ఒకనాడు ఏడుగురు ముఖ్యులతో వేటకు వెళ్ళి, అరణ్యంలో వాళ్ళనుంచి వేరు పడిపోయి, హఠాత్తుగా మీదికి దూకిన పులితో హోరాహోరి పోరాడుతుండగా, వాళ్ళు వచ్చి అతణ్ణి రక్షించారు.

తన అన్న ఖైదుపాలయినందుకు గీతాంజలి చాలా దుఃఖించింది. ఆమె తండ్రి వీరకేతుడు, అల్లుడి మనసు నొప్పించకుండా, తన కుమారుడి విడుదల జరిగే ఉపాయం కోసం ఆలోచించసాగాడు.

ఒకవారం గడిచాక విక్రమ సింహుడి ఆస్థానానికి ఒక యోగి వచ్చాడు. ఆయన రాజుతో, "మనిషన్నవాడికి తాపత్రయాల బాధ ఎక్కువ. ఏడు రోజులలో అందరూ చనిపోయే వాళ్ళే, తిరిగి ఏడు రోజులలో పుట్టడం కూడా జరుగుతుంది," అన్నాడు.

ఆ మాటలకు విక్రమసింహుడు ఆశ్చర్యపోతూ, "అందరూ ఏడు రోజులలో చనిపోవడం, తిరిగి ఏడు రోజులలో పుట్టడం—మీరంటున్నదేమిటో నా కర్థం కావడంలేదు," అన్నాడు.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

యోగి నవ్వి, "రాజా, వారానికి ఏడు రోజులే కదా? మనిషి మరణం యీ ఏడు రోజులలో, ఏదో ఒకరోజున జరుగుతుంది. అలాగే పుట్టడం కూడా, ఆదివారం, శని వారాల మధ్య జరుగుతుంది. అందు వల్లనే ఏడుసంఖ్యకు అంత ప్రాముఖ్యం వున్నది," అన్నాడు.

"ఏడు సంఖ్యకు ప్రాముఖ్యమా? అందులో ఏడుపు ధ్వనిస్తుంది! ఏడు చాలా చెడ్డ సంఖ్య," అని విక్రమ సింహుడు తన అనుభవాలు చెప్పాడు.

అంతా సావధానంగా విని యోగి, "రాజా, ఏడు చాలా మంచి సంఖ్య గనకనే, ఏడవ ఏట జలగండం తప్పించుకో గలిగావు. అలాగే, ఏడుగురితో వేటకు వెళ్ళి పులివాత పడకుండా ప్రాణాలతో బయటపడ్డావు," అన్నాడు.

విక్రమసింహుడు, యోగి చెప్పినది నమ్మలేనన్నట్టుగా తలపంకించడం చూసి, యోగి, "మహారుషులని మన పురాణాలు చెప్పినది ఏడుగురే. సూర్యుడి రథానికి అశ్వాలు ఏడు, సంగీతస్వరాలు ఏడు. అలాగే, ఏడుజన్మల బంధం అంటారు. పెళ్లిలో వధూవరుల చేత ఏడడుగులు వేయిస్తారు. ఇప్పటికైనా గ్రహించావా, ఏడు సంఖ్య ప్రాముఖ్యం?" అన్నాడు.

యోగి సంఖ్యలను గురించి తనకున్న మూఢవిశ్వాసాన్ని వదిలించడానికి వచ్చాడన్న సంగతి గ్రహించలేని విక్రమ సింహుడు, ఈసారి ఏడుసంఖ్య పరమ పవిత్రమైనదన్న మరొకరకం మూఢ విశ్వాసంలో పడిపోయాడు. ఆయన తన బావమరిదిని విడుదల చేసి, జరిగినదానికి క్షమాపణ కోరాడు.

ఈ యోగి వేషంలో వున్నది, వీరకేతు ఆస్థానపండితులలో ఒకడైన నారాయణ భట్టు. ఆయన రాజుకు జరిగినదంతా చెప్పి, "మన యువరాజు విడుదలయ్యాడు. కాని, మీ అల్లుడుగారు యీసారి ఏడుసంఖ్య మహా పవిత్రమైనదన్న మూఢవిశ్వాసంలో పడిపోయాడని, నా అనుమానం!" అన్నాడు.



# ఆత్మాభిమానం

షావుకారు భద్రయ్యగారింట్లో దొంగతనం జరిగింది. కాని, దొంగిలించబడ్డ వస్తువులన్నీ వున్న మూట, ఇంటి ప్రహరీ గోడలోపలే పడి వున్నది. వీధిలోని వాళ్ళంతా చేరి ఏం జరిగివుంటుందో ఊహించడానికి ప్రయత్నిస్తున్నారు.

"సామానంతా మూటకట్టి తీసుకుపోతూండగా, ఎవరో వస్తున్న అలికిడి అయివుంటుంది. దాన్ని అక్కడే వదిలి పారిపోయాడు. పిరికివెధవ!" అన్నాడు ఎదురింటి కామేశం.

"అలా జరిగుండదు. ఆశకొద్దీ కనబడినదంతా మూట కట్టేశాడు. కాని, మోయలేక పారేసి పోయివుంటాడు. బక్కవెధవ!" అన్నాడు పక్కింటి శేషాచలం.

"వాడెవడో మన వీధివాడయే వుండాలి. అంత సామాను పక్కింటి వాళ్ళ కంటబడకుండా దాయటం కష్టమని, ఆఖరి నిమిషంలో భయపడి వుంటాడు, పారుబోతువెధవ!" అన్నాడు పొరుగింటి సింహాద్రి.

అప్పటివరకూ ఇదంతా వింటూ, నేలచూపులు చూస్తున్న వెనక ఇంటి మాధవు డనేవాడు చప్పున తలఎత్తి రోషంగా, "మీరనుకుంటున్నట్టు ఆ దొంగ పిరికి, బక్క, పారుబోతువెధవై వుండడు! సామానంతా మూటగట్టి, గోడ ఎక్కి పారిపోదామనుకుని వుంటాడు. కాని, హఠాత్తుగా కాలుజారి మూట లోపల పడిపోయింది, నేను బయటపడిపోయాను," అన్నాడు. దొంగ దొరికిపోయాడు!

—కోనే నాగ వెంకట ఆంజనేయులు





# చెల్లెలి పెళ్ళి

రత్నయ్య రెండెకరాల పొలమున్న చిన్న రైతు. అతనికి ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. పెద్దవాడికి పెళ్ళయిన కొద్ది రోజులకే రత్నయ్య జబ్బుపడ్డాడు.

ఆయన చివరిదశలో కొడుకు లిద్దర్నీ పిలిచి, "నేను నా జీవితకాలమంతా శ్రమించినా పెద్దగా ఆస్తిపాస్తులు సంపాదించలేకపోయాను. నా చివరి కోరికల్లా ఒకటే! మీ చెల్లెలికి మంచి సంబంధం చూసి పెళ్ళి చేయండి." అంటూ కళ్ళు మూశాడు.

తండ్రి పోయాక పెద్దవాడు చెల్లెలికి సంబంధాలు వెతికాడు. చిన్నవాడు వచ్చిన వాటి నన్నింటిని తిరగ్గొట్టాడు. "ఇలా అయితే మనం చెల్లెలి పెళ్ళి చేయలేంరా," అన్నాడు పెద్దవాడు.

"ఎంత కష్టమైనా సరే చెల్లెలికి మంచి సంబంధమే చేయాలి. తొందరపడి దాని బతుకు నాశనం చేయడానికి లేదు. నాన్న గారి చివరి కోరిక గుర్తులేధా నీకు?" అన్నాడు చిన్నవాడు.

"నువు చెప్పే సంబంధాల్లాంటివి కుదరాలంటే, కట్నకానుకల కింద బోలెడంత ఇచ్చుకోవాల్సి వుంటుంది. అంతలేసి కట్నాలు మనమెక్కడ తేగలం?" అన్నాడు పెద్దవాడు.

"ఉన్న రెండెకరాలు అమ్మయినా సరే చెల్లెలికి మంచి సంబంధమే చేయాలి," అన్నాడు చిన్నవాడు పట్టుదలగా.

అన్నదమ్ముల సంభాషణ అంతా పెద్ద వాడి భార్య చాటున వుండి విన్నది. ఆమె తన భర్తతో, "మీ తమ్ముడి వాలకం చూస్తుంటే, చివరకు మనకు చేతికి చిప్ప వచ్చేటట్లున్నది. ముందుచూపు లేకుండా మీ తమ్ముడు మాట్లాడుతున్నాడు.

గంగిశెట్టి శివకుమార్

అంతగా కావాలంటే, ఆస్తి పంపకం చేసి, అతని కొచ్చేవాటా ఎకరం భూమిని అమ్మి, చెల్లెలి పెళ్ళి చేయమనండి,'' అన్నది.

పెద్దవాడు ఆలోచనలో పడ్డాడు.

''ఏ సంగతీ ఎంత త్వరగా తేల్చితే, అంత మంచిది!'' అన్నది పెద్దవాడి భార్య.

రెండు మూడు రోజులు గడిచినా పెద్ద వాడి ఆలోచనలు తెగలేదు. అంతలో అతడికి అత్తగారింటి నుండి రమ్మని కబురొచ్చింది.

పెద్దవాడు, తన భార్యతో కలిసి అత్త గారి వూరు వెళ్ళాడు. ఇల్లు చేరగానే పెద్దవాడి భార్య తల్లితో, ''ఏమ్మా! అవస రంగా కబురు చేశారు. విశేషాలేమయినా వున్నాయా?'' అన్నది.

''మీ చెల్లెలిని చూడడానికి ఈ రోజు పొరుగూరు నుండి వస్తున్నారు! పెళ్ళి కొడుకు నీకూ్కడా నచ్చాలికదా! అందు కని పిలిపించాను,'' అన్నది తల్లి.

పెళ్ళి చూపులు అయాయి. పిల్లవాడు అందగాడు! బాగా చదువుకున్నవాడు! పైై పెచ్చు కట్టుకుపోయినంత ఆస్తి వున్నది! చెల్లెలు అదృష్టవంతురాలే! అనుకున్నది మనసులో పెద్దవాడి భార్య.

పెళ్ళి చూపులకు వచ్చినవారిని వూరి పొలిమేరల దాకా దిగవిడిచి, ఉసూరు



మంటూ ఇల్లు చేరాడు పెద్దవాడి బావ మరిది.

నీరసంగా వున్న అన్న వాలకం చూసి, పెద్దవాడి భార్య ఆదుర్దాగా, ''ఏంరా అన్నయ్యా! చెల్లెలు వాళ్ళకు నచ్చలేదా ఏమిటి?'' అన్నది.

''పిల్ల వాళ్ళకు బాగానే నచ్చిందట! కాని కట్నం యాభైవేలు కావాలిట! మన మెక్కడ తేగలం అంత!'' అన్నాడు పెద్దవాడి బావమరిది.

''దానికేంలేరా! వున్నదేదో అమ్మి ఇద్దాం! అనుకున్నప్పుడల్లా ఇలాంటి మంచి సంబంధాలు రావు,'' అన్నది వాడి తల్లి.

ఆ మాటలకు పెద్దవాడి బావమరిది కన్నుమంటూ లేచాడు. "మీకేం? మీరెన్నయినా చెప్తారు. ఉన్నదంతా అమ్మి ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేసేస్తే మా గతేం కాను? చివరకు అడుక్కోవాల్సిందే గదా!" అన్నాడు.

పెద్దవాడి భార్యకు కోపం ముంచుకొచ్చింది. ఆమె అన్నతో, "ఏం మనిషివిరా నువ్వు! ఆడపిల్ల పెళ్ళికయ్యే ఖర్చులు మిగుల్చుకోవాలనీ, దాని గొంతు కోసి, ఆ డబ్బుతో హాయిగా కులకాలనీ అనుకుంటున్నావా? ఎక్కడయినా మగవాడు తన భుజాలకష్టం మీద బతకాలి గాని, ఇదేమిటి? నువ్వింత పనికిమాలిన వాడివవుతావని నే నెప్పుడూ అనుకోలేదు," అన్నది చీదరింపుగా.

ఈ సంభాషణ విన్న పెద్దవాడికి భార్య మాటలు చురకల్లా తగిలాయి.

తర్వాత ఇంటిల్లిపాదీ కలిసి పెద్దవాడి బావమరిదికి నచ్చ చెప్పారు. చివరకు వాడు రాజీకి వచ్చాడు.

ఆ తర్వాత రెండుమూడు రోజులుండి పెద్దవాడు తన భార్యతో సహా ఇల్లు చేరుకున్నాడు.

వాడు తన తమ్ముడితో తన భార్యకు వినపడేలాగా, "మన చెల్లెలికి మంచి సంబంధమే చేద్దాం! అవసరమయితే మనకున్నదంతా అమ్మయినా సరే!" అన్నాడు.

ఈ మాటలు పెద్దవాడి భార్య స్పష్టంగా విన్నది. తర్వాత కళ్ళనీళ్ళు పెట్టుకొని భర్తతో, "నా మాటంటే మీ కంత లెక్కలేకుండా పోయిందన్నమాట!" అన్నది.

"అవును! నీ మాట లెక్కపెట్టనవసరం లేదు. నీకు రెండు నాలుకలు! నీ పుట్టింటికయితే ఒక న్యాయం, మెట్టినింటికయితే మరొక న్యాయమూనా? నువు చెప్పినట్లు చేసి, పనికిమాలినవాడని పించుకోవడం, నా కిష్టంలేదు," అన్నాడు పెద్దవాడు.

పెద్దవాడి భార్య తన తప్పు తెలుసుకొన్నది.





# ప్రాణమిత్రుడు

పూర్వం బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించేకాలంలో బోధిసత్వుడు ఒక బ్రాహ్మణుడికి కుమారుడుగా పుట్టాడు. అతడికి తల్లిదండ్రులు సత్యానందుడు అని పేరు పెట్టారు. మరి కొంత కాలానికి బ్రాహ్మణుడికి మరొక కొడుకు కలిగాడు. ఇతడికి నిత్యానందుడు అని పేరు పెట్టారు.

ఈ అన్నదమ్ములిద్దరూ పెరిగి పెద్దవాళ్ళవుతూండగా, తల్లిదండ్రులు హఠాత్తుగా కాలధర్మంచెందారు. దానితో జీవితం మీద విరక్తులై సత్యానందుడూ, నిత్యానందుడూ గంగానదికి అవలి ఒడ్డున ఒకరూ, ఈవలి ఒడ్డున ఒకరూ కుటీరాలు నిర్మించుకుని సన్యాసి జీవితం గడపసాగారు.

ఒక రోజున పాతాళలోకంలో వుండే సర్పరాజు మణికాంతుడనేవాడు మనుష్యరూఫం ధరించి, భూలోకానికి వచ్చి, గంగానది ఒడ్డునే నడిచిపోసాగాడు. అతడికి నిత్యానందుడి కుటీరం కంటబడింది. మణికాంతుడు అంత చిన్నతనంలోనే సన్యాసి జీవితం గడుపుతున్న నిత్యానందుణ్ణి చూసి ఆశ్చర్యపడి, అతడికి తానెవరో చెప్పి, చాలాసేపు కబుర్లాడుతూ కాలం గడిపాడు.

ఈ విధంగా నిత్యానందుడికీ, సర్పరాజు మణికాంతుడికీ స్నేహం కుదిరింది. ఆ నాటి నుంచీ మణికాంతుడు తరచుగా నిత్యానందుడి కుటీరానికి వస్తూండేవాడు. వాళ్ళిద్దరూ ఎన్నో అసక్తికరమైన లోక విషయాలను గురించి గంటల తరబడి మాట్లాడుకునేవారు. మణికాంతుడు అప్పుడప్పుడు తన యథారూపం ధరించి, నిత్యానందుడి తలపై పడగవిప్పి, చల్లని నీడపట్టి, తన లోకానికి వెళ్ళిపోతూండేవాడు.



ఇలా కొంతకాలం జరిగాక నిత్యానందుడికి ఒక శంక పట్టుకున్నది. సర్పరాజు మణికాంతుడు తనకు మిత్రుడన్న దాంట్లో సందేహం లేదు. కాని, స్వతహాగా సర్పాలది దుష్టస్వభావం. ఏ కారణం చేతనైనా మణికాంతుడికి తన మీద కోపం వస్తే, కాటు వేయగలడు!

ఇలాంటి ఆలోచనలతో నిత్యానందుడికి ఎక్కడలేని బెంగపట్టుకున్నది. ఈ స్థితిలో ఒకనాడు అతడు నది దాటి అన్న సత్యానందుణ్ణి చూడబోయాడు. సత్యానందుడు తమ్ముణ్ణి చూసి వ్యాకులపడుతూ, "తమ్ముడూ, యింతగా చిక్కిపోయావేం? కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

ఇందుకు నిత్యానందుడు ఏమీ దాచకుండా అన్నకు చెప్పివేశాడు.

"తమ్ముడూ, నువ్వు చెప్పేదాన్ని బట్టి చూస్తూంటే, ఆ సర్పరాజును నువ్వు ప్రాణమిత్రుడుగా భావిస్తున్నట్టున్నది. అయినా, మరొకవైపున అతణ్ణించి హాని జరుగుతుందేమో అని భయపడుతున్నావు. ఇంతకూ అతడు నీ వద్దకు రావడం యిష్టమా లేక అతడు మరి కనబడకుండా వుంటే, నీకు సుఖంగా వుంటుందా?" అని సత్యానందుడు అడిగాడు.

నిత్యానందుడు కొంచెం ఆలోచించి, "అతడు రాకుండా వుంటేనే నాకు మనశ్శాంతి కలిగేలా వున్నది. కాని, అతణ్ణి రావద్దని చెప్పడం మాత్రం నా వల్ల కాదు," అన్నాడు.

ఆ జవాబుకు సత్యానందుడు నవ్వి, "సరే. ఆ సర్పరాజు నీ వద్దకు వచ్చేటప్పుడు ఎలాంటి ఆభరణాలు ధరిస్తాడు?" అని అడిగాడు.

"అతడి శరీరం మీద ఆభరణాలకేం కొదవలేదు. కాని, అన్నిటికన్న గొప్పగా ధగధగమెరిసే మణి ఒకటి అతడి కంఠం నుంచి వేళ్ళాడుతుంటుంది," అన్నాడు నిత్యానందుడు.

"తమ్ముడూ, అలా అయితే ఒక పని చెయ్యి. ఈసారి ఆ సర్పరాజు నీ దగ్గిరకు

వచ్చినప్పుడు, ఆ మణి యివ్వమని అడుగు,'' అని చెప్పాడు సత్యానందుడు.

రెండు, మూడు రోజుల తరవాత మణి కాంతుడు, నిత్యానందుడి కుటీరానికి వచ్చాడు. నిత్యానందుడు అతణ్ణి మణి యివ్వమని అడిగాడు. మణికాంతుడు కుటీరంలో కూర్చోకుండానే తన లోకానికి తిరిగిపోయాడు.

మర్నాడు మణికాంతుడు రాగానే, నిత్యానందుడు అతణ్ణి ద్వారం దగ్గిరే, ''నిన్న నీ మెడలోని మణి యివ్వమని అడిగాను, యిచ్చావుకాదు,'' అన్నాడు.

మణికాంతుడు కుటీరంలో ప్రవేశించకుండా, ద్వారం దగ్గిర నుంచే వెనక్కు తిరిగిపోయాడు.

మూడవరోజున మణికాంతుడు కుటీరాన్ని సమీపిస్తూండగానే, నిత్యానందుడు అతడికి ఎదురుపోయి, ''మణి యివ్వమని యింతవరకు రెండుసార్లు అడిగాను. ఇవ్వాళయినా యిస్తావా, లేదా ?'' అని గద్దిస్తూ అడిగాడు.

సర్పరాజు మణికాంతుడు విచారంగా ముఖం పెట్టి, ''నిత్యానందా, యీ మణి సామాన్యమైనది కాదు. ఇది నేను ఏది కోరితే అదిచ్చే కామధేనువు, కల్పతరువు. ఇటువంటి దాన్ని అడిగితే, ఎలా యివ్వగలను ? అందువలన నేను యిక ఏనాడూ నీ కుటీరం చాయలకు కూడా రాను,'' అంటూ వెనుదిరిగి, తన లోకానికి వెళ్ళిపోయాడు.



నిత్యానందుడు, మణికాంతుడు వస్తాడేమో అని ఒక వారం రోజులపాటు ఎదురుచూశాడు. అతడు రాలేదు. దానితో అతడికి ప్రాణమిత్రుణ్ణి పోగొట్టుకున్నానే అన్న బెంగపట్టుకుని, చిక్కి శల్యమై పోయాడు.

ఈ స్థితిలో సత్యానందుడు, తమ్ముడు ఎలా వున్నాడో చూసి పోదామని అతడి కుటీరానికి వచ్చాడు. తమ్ముడి దేహస్థితి చూసి సత్యానందుడు చాలా వ్యాకులం చెంది, "నీ ఆరోగ్యం మునుపటికన్నా కూడా మరింతగా పాడైపోయినట్టున్నది. నేను చెప్పినట్టు చేశావా? సర్పరాజు పీడ యింకా విరగడ కాలేదా?" అన్నాడు.

"అన్నా, నువ్వు చెప్పినట్టే, ఆ సర్ప రాజును మణి యివ్వమని అడిగాను. ఆనాటి నుంచీ అతను యిక్కడికి రావడం మానేశాడు. అతడు కుటీరానికి వచ్చి నాతో మాట్లాడుతూ, తన పడగవిప్పి నా తలపై ఆచ్ఛాదనగా పట్టడం నా కెంతో ఆనందకారణంగా వుండేది. ఇప్పుడు నాకు వెర్రెత్తినట్టుగా మనసు కలవరం చెందుతున్నది. ఇందువల్లనే, నే నింతగా శుష్కించిపోయాను," అన్నాడు నిత్యానందుడు.

అప్పుడు అన్న అయిన బోధిసత్వుడు ఎంతో శాంతంగా, "తమ్ముడూ, సర్ప రాజైన ఆ మణికాంతుడు నీ ప్రాణ స్నేహితుడయినందుకు ఎంతగానో మురిసి పోయావు. కాని, అంత ప్రాణస్నేహితుడూ నువ్వు మణి యివ్వమని అడిగేసరికి, నీ మొహం చూడడమే మానేశాడు. ఇదేనా ప్రాణమిత్రుడైనవాడు ప్రవర్తించ వలసినతీరు? అతడు స్వార్థపరుడు, నిజమైన స్నేహితుడు కాదు. అందువల్ల అతడు యిక్కడికి రానందుకు విచారించకు," అని హితబోధ చేశాడు.

అన్న చెప్పిన మాటల్లోని సత్యాన్ని గ్రహించిన నిత్యానందుడు, ఆ తరవాత ఏనాడూ సర్పరాజును గురించి ఆలోచించనేలేదు. త్వరలోనే అతడికి విచారం పోయి, పూర్ణారోగ్యవంతుడయ్యాడు.





# యువాన్ చ్వాంగ్ యాత్రలు - 2

గంగా, యమునా నదుల సంగమ స్థానమైన ప్రయాగనగరం యువాన్ చ్వాంగ్‌ను మంత్రముగ్ధుణ్ణి చేసింది. అతడు నదీసంగమస్థానంలో స్నానాలు చేస్తున్న వేలకొలది యాత్రికులనే గాక, ఒక కోతుల గుంపూ, లేళ్ళమందా కూడా అక్కడ స్నానాలు చేస్తూండడం చూశాడు.

తరవాత యువాన్‌చ్వాంగ్ ప్రసిద్ధ బౌద్ధ విశ్వవిద్యాలయ కేంద్రమైన నలందకు వెళ్ళాడు. అక్కడ రెండు వందల మంది పండితులు ఆయనను పూల మాలలతో సత్కరించి, ప్రధానద్వారం గుండా విద్యాలయంలోకి తీసుకుపోయారు.





ఆ విద్యాలయ ప్రధానాచార్యుడు శీలభద్రుడు. ఆయన అప్పటికి నూటఆరేళ్ళ పండుముసలి. అయినా, అనారోగ్యాన్నీ, వార్ధక్యాన్నీ లెక్కచేయకుండా శీలభద్రుడు స్వయంగా చ్వాంగ్‌కు విద్యాలయంలోని వివిధ విద్యాశాఖల్నీ వెంటవుండి చూపించాడు. అతడి రాక గురించి తాను ముందే స్వప్నంలో ఎలా తెలుసుకున్నదీ చ్వాంగ్‌కు వివరించాడు.



ఈ విద్యాలయం అనేక భవనాలతో, స్థూపాలతో కనువిందు చేసేలా వున్నది. దాని చుట్టూ అక్కడక్కడ తామర పూలతో కళకళలాడే సరస్సులున్నవి. ఎనభై అడుగుల ఎత్తుగల రాగి బుద్ధ విగ్రహం వున్నది. ఈ విద్యాలయంలో శిక్షణ పొందేందుకు టిబెట్, శ్రీలంక, జావా ద్వీపాల నుంచి విద్యార్థులు వస్తూండేవాళ్ళు. తొమ్మిది అంతస్తులు గల భవనంలో పెద్ద గ్రంథాలయం కూడా వున్నది.

ఒకనాటి రాత్రి యువాన్‌చ్వాంగ్ ఒక వింత స్వప్నం కన్నాడు. విద్యాలయం వున్న భవనాలన్నీ సర్వనాశనం అయిపోయి, మిగిలివున్న ఒకే ఒక శిథిల భవనం ప్రాంతాన పశువులు మేస్తున్నట్టు అతడు చూశాడు.





అంతేకాక, స్వప్నంలో అతడికి ఒక దివ్యపురుషుడు కనిపించి, దూరంగా రగులుతున్న మంటలను చూపించి, సాధ్యమైనంత త్వరలో స్వదేశానికి తిరిగిపొమ్మని ఆదేశించాడు. చ్వాంగ్ నలందా నుంచి వెళ్ళిపోయిన తరవాత, నిజంగానే నలందా పెద్ద అగ్ని ప్రమాదానికి గురైంది.



ఒకానొక కొండమీద గంధపుచెక్కతో తయారుచేసిన బుద్ధవిగ్రహం వుండేది. ఎవరైనా ఆ విగ్రహం పైకి విసిరిన పూలదండలు, విగ్రహం చేతుల నుంచి వేళ్ళాడడం జరిగితే, ఆ పూలదండలు విసిరిన వాడి కోర్కెలు ఫలించగలవనే వారు. చ్వాంగ్ తాను నిజమైన భక్తుడుగా జీవించదలచినట్టు కోరుకుని, విగ్రహం పైకి మూడు మాలలు విసిరాడు. ఒకటి విగ్రహం మెడలోనూ, రెండు చేతుల నుంచీ వేళ్ళాడినై.

ఆ కాలంలో చక్రవర్తులైన పులకేశి, హర్షవర్ధనుల మధ్య తరచుగా యుద్ధాలు జరుగుతుండేవి. పులకేసి పక్షం వాళ్ళు ఏనుగులకు మత్తెక్కించి, వాటిని శత్రువుల పైకి ఎగదోలి, వాళ్ళను చిందరవందర చేసేవాళ్ళు. చ్వాంగ్ యిలాంటి సంఘటనలను గ్రంథస్థం చేశాడు.





హర్షవర్ధనుడు, చ్వాంగ్‌ను తన అస్థానానికి ఆహ్వానించాడు. ఆయునా, చెల్లెలు రాజ్యశ్రీ చ్వాంగ్ రాక సందర్భంలో గొప్ప ఉత్సవం ఏర్పాటు చేశారు. హర్షవర్ధనుడి జ్ఞానతృష్ణ, చ్వాంగ్‌కు ఎంతో ఆనందం కలిగించింది.



హర్షవర్ధనుడు తన రాజధాని కన్యాకుబ్జలో సామంత, కవి, పండిత, పుర ప్రముఖులతో ఒక గొప్ప సభ ఏర్పాటు చేశాడు. యువాన్‌చ్వాంగ్ సభలోని వారందరూ మెచ్చుకునే విధంగా మహాయాన బౌద్ధాన్ని గురించి ఉపన్యసించాడు.

మహాసభ ముగింపురోజున ఒకడు హర్షవర్ధనుణ్ణి కత్తితో పొడవబోయాడు. కాని హర్షవర్ధనుడు దెబ్బ తప్పుకుని, ఆ దుష్టుణ్ణి కిందపడేలా కొట్టాడు. ప్రశ్నించిన మీదట వాడు చక్రవర్తి శత్రువులు తనను పంపినట్టు చెప్పాడు. హర్షవర్ధనుడు వాణ్ణి క్షమించి, వదిలి వేశాడు.





తక్షశిల, కాశ్మీర్ ప్రాంతాల మీదుగా యువాన్‌చ్వాంగ్ చైనాదేశం చేరాడు. భారతదేశానికి ఒంటరిగా వచ్చిన చ్వాంగ్, స్వదేశం వెళ్ళేప్పుడు నూరు మంది అంగరక్షకులతో, ఇరవై గుర్రాల మీద బౌద్ధమత గ్రంథాలూ, ప్రతిమలూ చిత్తరువులతో ప్రయాణించాడు. అతణ్ణి చైనా చక్రవర్తి తాయ్‌చుంగ్ ఘనంగా సన్మానించాడు.

# కక్కుర్తి

శివం పట్నంలో పెద్ద ఉద్యోగి. అయినా కక్కుర్తి మనిషి. ఒకనాడు అతను కొంతమంది మిత్రులతో సహా వాహ్యాళి వెళ్ళి, రహదారిన తిరిగి వస్తూండగా అతని కొక మూట దారిలో దొరికింది. అందులో వెయ్యి రూపాయలున్నాయి. దాన్ని న్యాయస్థానంలో ఇచ్చేస్తే, పోగొట్టుకున్నవారికి చేరుతుందని మిత్రులు అన్నారు. కాని, శివం అందుకు ఒప్పుకోక, ఆ వెయ్యి రూపాయలూ తన వెంట ఉన్నవారితోపాటు తానూ పంచుకున్నాడు. అతను చేసిన పని అతని అనుచరులకు నచ్చలేదు కాని, అతని హోదా పెద్దది గనక ఊరుకున్నారు.

శివం ఇంటికి చేరేసరికి అతని అత్తగారు వచ్చి ఉన్నది. అతన్ని చూస్తూనే ఆమె, "అల్లుడూ, ఈ ఏడాది నీకు బట్టలు పెట్టలేదు. అందుకని వెయ్యి రూపాయలు, ఎడ్లబండి అమ్మిన బాపతు, తెచ్చాను," అంటూ సంచీలో చెయ్యిపెట్టి, "అయ్యో, నాయనా! డబ్బు మూట కనబడడం లేదు. దారిలో పోయింది గామాలు. నువు వెళ్ళి వెంటనే రక్షకభటులకు ఫిర్యాదు చేసిరా!" అన్నది.

శివం అత్తగారి మాటలకు కొయ్యబారిపోయాడు. —శరత్





# దుర్జనుల సఖ్యం

ఒక ఊళ్లో ఒక సన్యాసి ఉండేవాడు. ఊరి చివర ఒక కుటీరంలో ఆయన నివసిస్తూ ఉండేవాడు. ఆయన భక్తులు కొందరు నిత్యమూ ఆయనకు పళ్ళూ, ఫలహారాలూ, భోజనమూ తెచ్చి సమర్పించి పోతూవుండేవారు. వీటితో ఆయన జీవిస్తుండేవాడు. ఒకవేళ ఏనాడైనా ఎవరూ రాకపోతే ఆ రోజు సన్యాసి పస్తుండేవాడే గాని భోజనం లేదని విచారించేవాడు కాడు. సన్యాసి అప్పుడప్పుడూ ఉపవాసాలుంటున్నాడని తెలిసి ఒక భక్తుడు గేదె నొకదానిని తెచ్చి సన్యాసికిచ్చాడు. అది కూడా ఆ కుటీరంలోనే ఉండి సన్యాసికి పాలిస్తూ ఉండేది.

సన్యాసి కుటీరంలో ఉన్న గేదెను కాజెయ్యాలని ఒక దొంగకు ఆలోచన కలిగింది. ఇదేమంత కష్టసాధ్యమైన పని కాదు. కుటీరం ఊరి చివర ఉన్నది. దానికి పెద్ద రక్షణ ఏమీ లేదు. అఖరుకు తలుపుకు గొళ్ళెం కూడా లేదు. సన్యాసి నిద్రించే సమయంలో లోపల జొరబడి గేదెను విప్పి నిశ్చింతగా తోలుకుపోవచ్చు. అందుచేత ఒక చీకటి రాత్రి దొంగ, సన్యాసి కుటీరానికి బయలుదేరాడు.

దారిలో దొంగకు మరొకడు తటస్థపడి వెంట రాసాగాడు.

''ఎవరవు నువ్వు? నా వెంట ఎందుకు వస్తున్నావు? నేను వేరే పని మీద పోతున్నాను. నీ దారిన నువు పో!'' అన్నాడు దొంగ.

దానికా రెండో మనిషి, ''నేను భూతాన్ని. ఊరిచివర కుటీరంలో ఉన్న సన్యాసిని చంపటానికి పోతున్నాను. ఈ సన్యాసి వూరికి వచ్చింది మొదలు జనం మంచిగా ఉంటున్నారు. అందుచేత నా వ్యాపారం బొత్తిగా అడుగంటింది.

ఊళ్ళో అన్యాయాలూ, అక్రమాలూ, దౌర్జన్యాలూ లేకుండా పోయాయి. అందు చేత ఈ సన్యాసిని చంపి మళ్ళీ నా పెత్తనం సాగించుకుంటాను. నీ ప్రయాణం ఎందాకా? దాచకుండా చెప్పు," అని అడిగాడు.

"నా వృత్తి దొంగతనం. నేనూ ఆ సన్యాసి కుటీరానికే పోతున్నాను. కాని నా ఉద్దేశం సన్యాసిని చంపటం కాదు. ఆ సన్యాసికి ఒక భక్తుడు పాడిగేదె నొక దానిని ఇచ్చాడు. దానిని దొంగిలించ బోతున్నాను," అన్నాడు దొంగ.

భూతమూ, దొంగా సన్యాసికి హాని చేద్దామని ఒకే చోటికి పోతున్నారు గనక, వారికి సఖ్యం కుదిరింది. స్నేహితుల్లాగా చేతులు కలుపుకుని వారు అర్ధరాత్రి వేళ సన్యాసి కుటీరం చేరారు. ఎక్కడా చడీ చప్పుడూ లేదు.

సన్యాసి కుటీరం లోపల సుఖంగా నిద్రపోతున్నాడు.

దొంగ తనలో తాను ఈ విధంగా ఆలోచించుకున్నాడు :

"ముందుగా ఈ భూతం సన్యాసిని చంపబోయే పక్షంలో సన్యాసి అరిచి అల్లరి చేసినట్టయితే నలుగురూ వస్తారు. ఆ తరవాత నేను గేదెను దొంగిలించటం సాధ్యపడదు. అందుచేత నేనే ముందు పని ముగించుకోవటం మంచిది. తరవాత భూతం దాని చావు అది చస్తుంది, నా కేం!"



అదే సమయంలో భూతం కూడా తనలో ఇలా ఆలోచించుకోవటం మొదలు పెట్టింది :

"ఈ దొంగ ముందుగా గేదెను దొంగిలించటానికి యత్నించినట్టయితే గేదె అరవవచ్చు. సన్యాసి లేస్తాడు. కేక వేస్తాడు. నలుగురూ వస్తారు. అప్పుడు నేను సన్యాసిని హత్యచేయటం సాధ్యం కాదు."

పైకి భూతం దొంగతో ఈ విధంగా అన్నది : "తమ్ముడూ, ముందు నేను సన్యాసిని చంపేస్తాను. ఆ తరువాత నువు నిశ్చింతగా గేదెను తోలుకుపో, నిన్నడ్డే వారే ఉండరు!"

దానికి దొంగ, "అలా కాదు, అన్నా. ముందు నన్ను గుట్టుచప్పుడు కాకుండా గేదెను తోలుకుపోనీ, తరవాత నువు సన్యాసిని యథేచ్ఛగా చంపుదువు గాని. నాది చాలా చిన్నపని!" అన్నాడు.

ఇద్దరూ వాదించుకోసాగారు. వాదన తగువుగా మారింది. మొదట రహస్యంగా మాట్లాడుకున్న వారు క్రమంగా గొంతు ఎత్తి, నేను ముందు అంటే నేను ముందు అని అరవసాగారు. అది రానురాను పెద్ద కేకల కిందికీ, పెడబొబ్బల కిందికీ మారింది.

చివరకు దొంగ ఎలుగెత్తి, "ఏమయ్యోయ్, సన్యాసీ! ఇదుగో భూతం వచ్చింది చూడు, నిన్ను చంపటానికి!" అని అరిచాడు.

భూతం అంతకన్న కోపంగా, "ఇదుగో నయ్యోయ్, సన్యాసీ, దొంగ! నీ గేదెను కాజేస్తాట్ట!" అన్నది.

ఈ అల్లరికి సన్యాసి మాత్రమే కాక చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు కూడా కర్రలూ, కత్తులూ పట్టుకుని పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ వచ్చిన వారిలో కొందరు పారిపో చూస్తున్న దొంగను పట్టుకున్నారు. ఒక భూతవైద్యుడు భూతాన్ని అక్కడే బంధించి మారణహోమం చేశాడు.

దుర్జనుల మధ్య సఖ్యం ఎంతో కాలం నిలవదు.





# నిజమైన స్నేహితుడు

వీరయ్యకు చిన్నప్పటినుంచి, తనను గురించి లేనిపోని గొప్పలు చెప్పుకోవడం అలవాటు. అది మంచి అలవాటు కాదని తండ్రి వాడికి ఎన్నోసార్లు చెప్పి చూశాడు. అయినా, వీరయ్యలో ఎలాంటి మార్పూ రాలేదు.

వీరయ్య శాఖాహారి. అయితే, వాడు తాను అహింసావాదినని గొప్పలు చెప్పేవాడు. మాంసాహారులందర్నీ వెటకారం చేసేవాడు. వాళ్ళంతా జంతుహింస చేసే దుర్మార్గులని అనేవాడు.

ఇలా వుండగా, ఒకరోజున వీరయ్య ఇంట్లోకి తాచుపాము వచ్చింది. వీరయ్య తండ్రి దాన్ని చంపేశాడు. ఇందులో వీరయ్య తండ్రికి సాయపడ్డాడు.

''తాచుపామును చంపడం హింస కాదా ?'' అని వీరయ్య స్నేహితుడొకడు అడిగాడు.

''కానే కాదు. అది కప్పల్నీ, ఎలుకల్నీ హింసిస్తుంది. ఒక్క తాచుపాము చస్తే, ఎన్నో యితర జీవాలు రక్షించబడతాయి. అందుకే నేను దాన్ని చంపించేశాను తప్పితే, నా ప్రాణాలు రక్షించుకోవడం కోసం కాదు,'' అన్నాడు వీరయ్య.

''నేనూ అందుకే మేకల్ని చంపి తింటాను. వాటిని అలా స్వేచ్ఛగా వదిలి పెడితే పొలాల్లో పడి పంటా, గడ్డీ మేసి, నీ లాంటి వాడికి తిండి లేకుండా చేస్తాయి,'' అన్నాడు వీరయ్య స్నేహితుడు.

వీరయ్య, యీ మాటలు వినీవిననట్లు వూరుకున్నాడు. కానీ, ఆ తరవాత కూడా గొప్పలు చెప్పుకోవడం మానలేదు.

వీరయ్యకు యిద్దరు ప్రాణస్నేహితులున్నారు. వాళ్ళుకూడా వీరయ్యకు లేనిపోని గొప్పలు చెప్పవద్దని ఎన్నోమార్లు చెప్పి చూశారు. కాని, వీరయ్య తాను

జొన్నలగడ్డ రామలక్ష్మి



నిజం తప్ప మరేం మాట్లాడనని వాళ్ళకు జవాబిచ్చాడు.

ఈ ముగ్గురూ ఒకరోజున ఊరిమధ్య వున్న రావిచెట్టు కింద కూర్చుని కబుర్లు చెప్పుకుంటూండగా అక్కడికి నాలుగోవాడొకడు వచ్చి, "చూడ్డానికి మీరు మంచి మిత్రుల్లా కనబడుతున్నారు. నాకు మీతో స్నేహం చేయాలని వున్నది," అన్నాడు.

ఆ వచ్చినవాడిది పొరుగూరు. ఏదో పని మీద ఈ ఊరు వచ్చాడు. ఈ రాత్రికి ఎవరింట్లోనయినా పడుకుని, మర్నాడు వెళ్ళిపోతాడు.

వీరయ్య స్నేహితుడొకడు నిట్టూర్చి, "ఏం మంచి మిత్రులం? ఎంతో కాలంగా మిత్రులమైవుండి కూడా ఒకరి లోపాలొకరం సరిదిద్దుకోలేక పోతున్నాం. నిజమైన స్నేహితుడు మిత్రుణ్ణి సంస్కరించ గలగాలి!" అన్నాడు.

"అయితే, నేను నిజమైన స్నేహితుణ్ణి!" అన్నాడు నాలుగోవాడు.

"అలాగా! మా ముగ్గురిలో ఎవరి స్నేహం అంటే నీ కెక్కువ యిష్టం?" అని అడిగాడు వీరయ్య.

"ముఖం చూసి మనుషుల్ని అంచనా కట్టడం చాలా కష్టం. మీ ముగ్గురిలో ఎవరు నాకు యీ రాత్రి ఆశ్రయం యిస్తారో, వాళ్ళ స్నేహం అంటే నాకు ఎక్కువ యిష్టంగా వుంటుంది," అన్నాడు నాలుగోవాడు నవ్వుతూ.

వెంటనే ముగ్గురు మిత్రులూ నేనంటే నేనని పోటీ పడ్డారు. అప్పుడు నాలుగోవాడు వాళ్ళతో, "మీరలా పోటీలు పడకండి. నేనడిగిన ప్రశ్నకు, ఎవరు నాకు నచ్చే సమాధానం చెబితే, వాళ్ళింట్లో యీ రాత్రికి పడుకుంటాను. ఎటొచ్చీ మీరు అబద్ధం మాత్రం చెప్పకూడదు, నిజమే చెప్పాలి," అన్నాడు.

ఇందుకు మిత్రులు ముగ్గురూ అంగీకరించారు.

"డబ్బు గురించి మీ అభిప్రాయం చెప్పండి," అన్నాడు నాలుగోవాడు.

"ఈ ప్రపంచమంతా డబ్బుతోనే నడుస్తున్నది. నాకు డబ్బంటే ప్రాణం. లక్షలకు లక్షలు ఆర్జించాలని వుంటుంది. కాని, నేను పేదవాణ్ణి!" అన్నాడు వీరయ్య స్నేహితుల్లో ఒకడు.

"నేను కూడా పేదవాణ్ణే. అయితే, నాకు డబ్బు సంపాదించే మార్గాలు తెలుసు. ఎంత డబ్బు సంపాదించినా మనిషికి తృప్తి వుండదు. అందుకే, నేను అవసరానికి మించి డబ్బు సంపాదించను." అన్నాడు వీరయ్య రెండో స్నేహితుడు.

వీరయ్య ముఖం చిట్లించి గర్వంగా యిలా అన్నాడు: "నేను, నేను అనుకునేది, నేను కాదు. నాది నాది అనుకునేది, నాదికాదు. అదృష్టం కలిసి వచ్చి డబ్బు చేరితే, మనిషి అహంకారం కొద్దీ, అది తనే సంపాయించానని అనుకుంటాడు. నాకు చాలా డబ్బుంది. అయితే, డబ్బుమీద నాకు మమకారం లేదు. అది నాది అన్న భావం కూడా లేదు."

నాలుగోవాడు వీరయ్యనెంతగానో మెచ్చుకుని, "అందరిలోకీ నీ అభిప్రాయాలే ఎంతో ఉన్నతంగా వున్నవి. నేను, నీ స్నేహాన్నే కోరుతున్నాను." అన్నాడు.



ఆ మాటలకు వీరయ్యా పరవశుడై పోయి, "మా అభిప్రాయాలు చెప్పాం. అసలింతకూ డబ్బు గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

"అది నీకు, నేను రేపు చెపుతాను," అన్నాడు నాలుగోవాడు.

వీరయ్య, వాణ్ణి తన ఇంటికి తీసుకుపోయి, ఇల్లంతా చూపించి, సకల మర్యాదలూ చేశాడు. రాత్రికి మంచి భోజనం పెట్టి, సుఖనిద్రకు చక్కనిపడక ఏర్పాటు చేశాడు. వీరయ్యా, నాలుగోవాడూ ఒక గదిలోనే పడుకున్నారు.

తెల్లవారి లేచి చూస్తే వీరయ్యకు గదిలో నాలుగోవాడు కనిపించలేదు.

తనకంటే ముందు లేచి పెరట్లో బావి దగ్గిర స్నానం చేస్తున్నాడేమో అని వీరయ్య అక్కడికి వెళ్ళి చూశాడు. తరవాత ఇంట్లో అందర్నీ అడిగాడు. ఎవరూ వాణ్ణి చూడలేదన్నారు. అంటే, నాలుగోవాడు ఎప్పుడో ఒకరాత్రివేళ లేచి, తనకు చెప్ప కుండా వెళ్ళిపోయాడన్నమాట!

ఈ అనుమానం రాగానే వీరయ్య గుండె గుబగుబలాడింది. వాడు దొంగేమో అన్న శంక కూడా కలిగింది. వెంటనే వీరయ్య తన గదిలోకి పోయి పెట్టె తెరిచి చూశాడు. అందులో వుండవలసిన వెయ్యి వరహాలూ, బంగారు మురుగులూ, గొలుసూ కనిపించలేదు. కాని, పెట్టెలో చీటీ ఒకటున్నది.

"మిత్రమా! నాకు డబ్బంటే ప్రాణం కాదు; కానీ, డబ్బెంతో అవసరం! డబ్బు సంపాదించే మార్గాలు కూడా నా కెన్నో తెలుసు. అయినా, నాకెవర్నీ నొప్పించడం యిష్టముండదు. అందువల్లనే, సాధార ణంగా దొంగతనాలు చెయ్యను. డబ్బంటే మమకారం లేని, నీలాంటి మిత్రుడు దొరకడం, నా అదృష్టం!"

నాలుగోవాడు ఆ చీటీ రాసి అక్కడ పెట్టాడని వీరయ్య గ్రహించాడు. డబ్బు పోయిన సంగతి వాడు ఇంట్లో చెప్పలేదు. ఆ చీటీ తన మిత్రులకు చూపించి, జరిగింది చెప్పి, కళ్ళనీళ్ళు పెట్టు కున్నాడు.

"నీకు 'నాది' అన్న మమకారం లేదు కదా? పోయిన డబ్బు గురించి బాధ పడకు," అన్నారు వీరయ్య మిత్రులు.

"ఎందుకు నన్నింకా ఉడికిస్తారు? జన్మలో యిలాంటి గొప్పలు చెప్పను," అన్నాడు వీరయ్య.

"ఆ మాట మీదే నువ్వు నిలబడ గలిగితే, ఆ నాలుగోవాడు నిజంగానే నీకు మంచి మిత్రుడు! నీ లోని లోపాలను క్షాళనం చేసేశాడు," అన్నారు వీరయ్య మిత్రులు.

మిత్రుల మాటలకు సంతోషించాలో, దుఃఖపడాలో వీరయ్యకు అర్థం కాలేదు.





# సానపట్టిన వజ్రం

శ్రావణపురంలో గోపాలుడనే కుర్రవాడుండేవాడు. వాడికి తండ్రి లేడు. తల్లి వాణ్ణి పెంచి పెద్దచేసి, చదువుసంధ్యలు చెప్పించింది. చదువు పూర్తికాగానే వాడు ఉద్యోగ ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఒకనాడు తల్లి, గోపాలుడితో, "మీ చిన్నాన్న రాజధానీనగరంలో, రాజుగారి దివాణంలో పని చేస్తున్నాడు. నువు వెళ్ళి ఆయన్ని కలుసుకుంటే, ఏదో ఒక ఉద్యోగం చూపించకపోడు," అన్నది.

గోపాలుడు రాజధాని చేరి, పినతండ్రిని కలుసుకుని, తాను వచ్చిన పని చెప్పాడు. ఆయన పేరు విరూపాక్షయ్య.

ఆయన గోపాలుడితో, "దివాణంలో నాకు బాగా తెలిసిన పెద్ద మనుషులు నలుగురున్నారు. నిన్ను వాళ్ళకు పరిచయం చేస్తాను. వాళ్ళు, నీకు ఉద్యోగం సంపాయించి పెడతారు," అన్నాడు.

విరూపాక్షయ్య ముందుగా గోపాలుణ్ణి, దివాణంలోని ప్రధానాధికారి అయిన దుర్వాసుడి వద్దకు తీసుకుపోయాడు.

విరూపాక్షయ్య చెప్పింది విని, దుర్వాసుడు గోపాలుణ్ణి ఎగాదిగా చూసి, "ఈ బొట్టికాయకు అప్పుడే ఉద్యోగం ఎందుకు? వీడేం పని చెయ్యగలడు," అన్నాడు.

విరూపాక్షయ్య ఆయన్ని ప్రాధేయపడుతూ, "తమరు తప్ప, మా వాణ్ణి ఆదుకునేవారు ఎవరూ లేరు, బాబుగారూ! మీరు తలుచుకుంటే ఉద్యోగం యిప్పించగలరు," అన్నాడు.

దుర్వాసుడు మండిపడుతూ, "నాతో అలా రెట్టిస్తున్నట్టు మాట్లాడకు! మీ వాణ్ణి తరవాత కలవమను," అన్నాడు.

గోపాలుడు గది నుంచి బయిటికి వస్తూనే, "చిన్నాన్నా! ఇలాంటి కోపిష్ఠి

బొమ్మిడి అచ్చారావు



వాడు, మనకేం ఉపయోగపడతాడు? అనవసరంగా నువు మాటపడ్డావు." అన్నాడు.

విరూపాక్షయ్య నవ్వి, "ఆయన మాట దురుసుగా వుంటుందే గాని, మనసు వెన్న లాంటిది. తొందర లేదు, మరో నాలుగు రోజులు గడిచాకే కలుద్దువు గాని," అన్నాడు.

ఇక మరొకసారి ఆయన్ని ఎట్టిపరిస్థితుల్లోనూ కలవకూడదనుకున్నాడు, గోపాలుడు.

విరూపాక్షయ్య, గోపాలుణ్ణి మరొక ముగ్గురు పెద్దమనుషుల వద్దకు తీసుకుపోయి, పరిచయం చేశాడు.

మొదటి పెద్దమనిషి, "మీరు స్వయంగా రావాలా, విరూపాక్షయ్యగారూ! కాకితో కబురంపితే, మీ పని చేసేవాణ్ణిగా. రేపు ఒకసారి అబ్బాయిని పంపించండి; మీరు రానవసరం లేదు," అన్నాడు.

విరూపాక్షయ్య అలాగే అని వెళుతున్న సమయంలో పక్కకు పిలిచి, "మా మేనల్లుడి పొలం విషయం ఏదో తగాదాలో వున్నదని, మీకు లోగడ చెప్పాగదా. కొంచెం దివానుగారికి చెప్పి, పని సానుకూలం అయేలా చూడండి," అన్నాడు.

విరూపాక్షయ్య సరేనని గోపాలుడితో రెండో పెద్దమనిషి దగ్గిరకు వెళ్ళాడు. ఆయన కూడా గోపాలుడికి ఉద్యోగం వేయించే ప్రయత్నం చేస్తానని చెప్పి, తీరా విరూపాక్షయ్య వెళ్ళే సమయంలో, "మా తోడల్లుడు మిమ్మల్నొకసారి కలుసుకోవాలంటున్నాడు. మీ నుంచి ఏదో సాయం కావాలట. ఎప్పుడు పంపమంటారు?" అన్నాడు.

విరూపాక్షయ్య అతడికి అలాగే పంపమని చెప్పి, మూడో పెద్దమనిషి దగ్గిరకు వెళ్ళాడు.

ఆయన కూడా గోపాలుడికి ఉద్యోగం అయేలా చూస్తానని చెప్పి, "కుర్రాడు చూడబోతే చురుగ్గా వున్నాడు. ఆ ఉద్యోగం

ఏదో నేను వేయిస్తా గానీ, మా రెండో అమ్మాయిని, మీ వాడికి చేసుకుంటారా ఏమిటి ?'' అని అడిగాడు లౌక్యంగా.

'' ఆ విషయం తర్వాత మాట్లాడుకుందాం. ముందు ఉద్యోగప్రయత్నం చెయ్యండి,'' అన్నాడు విరూపాక్షయ్య శాంతంగా.

ఆయన ఇంటికి వెళ్ళే దారిలో గోపాలుడితో, '' వీళ్ళ నలుగుర్నీ రోజూ కలుసుకుంటూవుండు. ఎవరో ఒకరు దివాణంలో ఉద్యోగం వేయించక పోరు,'' అన్నాడు.

ఆ మర్నాటి నుంచీ గోపాలుడు దివాణానికి పోయి, దుర్వాసుణ్ణి తప్ప, మిగతా ముగ్గుర్నీ చూసి వస్తూండేవాడు.

నాలుగు రోజులు ఆగి విరూపాక్షయ్య వాణ్ణి, ''ఉద్యోగ ప్రయత్నం ఎంతవరకూ వచ్చింది ?'' అని అడిగాడు.

'' అందరూ నాకు బాగా మర్యాదలు చేస్తూనే వున్నారు. ఈ రోజు, రేపు,'' అంటున్నారు, అన్నాడు గోపాలుడు.

విరూపాక్షయ్య, గోపాలుడి కేసి అనుమానంగా చూస్తూ, '' నువ్వు, దుర్వాసుల వారిని కలుసుకున్నట్టు లేదే !" అన్నాడు.

'' ఆయన మొన్న కలుసుకున్నప్పుడు, నా కేసి పురుగును చూస్తున్నట్టు చూశాడు. ఈ రోజు ఆయన దగ్గిరకు పోలేదు,'' అన్నాడు గోపాలుడు.

"ఆయన్నికూడా తప్పక కలుస్తూండు," అన్నాడు విరూపాక్షయ్య.



మర్నాడు గోపాలుడు, దుర్వాసుణ్ణి కలుసుకున్నాడు. ఆయన, "నువ్వు ఎలాంటి పనులు చెయ్యగలవు?" అని గోపాలుణ్ణి అడిగాడు.

గోపాలుడికి చాలా సంతోషం కలిగింది. తాను చేయగల పనులు ఏకరువు పెట్టాడు.

"మా పెరట్లో మొక్కలకు నీళ్ళు పోసిరా!" అన్నాడు దుర్వాసుడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

గోపాలుడు, ఆయన అలాంటి పని చెబుతాడని ఊహించను కూడా లేదు. కాని, మారుమాట్టాడకుండా చెప్పినట్టు చేశాడు. తర్వాత మిగిలిన ముగ్గుర్నీ కలిశాడు. వాళ్ళు మామూలుగానే గోపాలుడికి మర్యాద చేశారు; చిన్నమెత్తు పని కూడా చెప్పలేదు.

గోపాలుడు మరసటి రోజు దుర్వాసుణ్ణి మళ్ళీ కలిశాడు. ఆయన వాణ్ణి చూస్తూనే, "ఈ రోజు మా పాలేరు రాలేదు. పశువులశాల శుభ్రంచేసి, గొడ్లకు మేత వెయ్యి," అన్నాడు.

గోపాలుడు యీ పనీ నోరెత్తకుండా చేశాడు. ఇలా దుర్వాసుడు రోజూ ఏదో ఒక పని చెబుతూనే వున్నాడు. ఉద్యోగం గురించిన మాటమాత్రం ఎత్తలేదు.

ఒకరోజున దుర్వాసుడు, విరూపాక్షయ్యకు కబురు చేసి పిలిపించాడు. పక్కనే గోపాలుడు కూడా వున్నాడు. ఆయన విరూపాక్షయ్యతో, "మీ అన్న కొడుక్కు అసాధ్యమైన పనే లేనట్టుంది! మీవాడు సానబట్టిన వజ్రంలాంటి వాడు. దివాణంలో పనివాళ్ళ మీద అధికారి ఉద్యోగం వేయిస్తున్నాను. రేపు వచ్చి చేరమను," అన్నాడు.

విరూపాక్షయ్య, గోపాలుడితో ఇల్లు చేరాక, "చూశావా, దుర్వాసుల వారి మనసు మెత్తదని, నీకు ముందే చెప్పాను. ఆయన నిన్ను రకరకాల పరీక్షలకు గురిచేసి, నీ సామర్థ్యం ఏపాటిదో తెలుసుకున్నాడు. మిగతా ముగ్గురూ, నాతో కాగల పనులు చేయించుకుని, నీ ఉద్యోగం సంగతి వదిలేశారు," అన్నాడు.





# విఘ్నేశ్వరుడు

గణాధిపత్య పట్టాభిషేకానికి పార్వతి ధగధగమెరిసే రంగుబట్టల్ని ఎన్నిక చేసింది. కాని, విఘ్నేశ్వరుడు తెల్లని వస్త్రాలు ధరించాడు.

"మంచి బట్టలు వేసుకోవలసిన సమయంలో శుక్లాంబరధరుడు అనిపించుకున్నావేమయ్యా?" అన్నది పార్వతి.

"మంచి బట్టలు కదమ్మా వేసుకోవాలి? అవే వేసుకున్నానమ్మా. తెలుపు మంచితనాన్ని, వివేకాన్ని తెలుపుతుంది!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

పట్టాభిషేకం జరిగింది. విఘ్నేశ్వరుడు గణనాథుడు అయాడు. జయలక్ష్మి పేరు గల సిద్ధి, విద్యావతి పేరు గల బుద్ధి విఘ్నేశ్వరుణ్ణి వరించి ఇరుపక్కలా చేరారు. గణనాథుడు సిద్ధి బుద్ధి వినాయకుడు అనిపించుకున్నాడు. అదే సమయంలో ఎనిమిది దిక్కుల నుండి అష్టసిద్ధులు ఎనమండుగురు చక్కని కన్యలై వచ్చి వకుళమాలలు వేసి, వినాయకుణ్ణి వరించారు. విఘ్నేశ్వరుడు సిద్ధివినాయకుడు అనిపించుకున్నాడు. కళ్యాణ మహోత్సవాలు వైభవంగా జరిగాయి.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, "కోటి విఘ్నాలు వచ్చినా వినాయకుడి పెళ్ళి ఆగదు! అనే కొత్త సామెత అమలు జరిగింది. ఓ కళ్యాణగణేశా! ఇక నీ చేతి మీదుగా కళ్యాణాలు జరగాలి. అలా జరిగిన కళ్యాణఫలంగా అవతరించిన జన్మేజన్మ!" అన్నాడు.

9. స్వామి అవతరణ



విఘ్నేశ్వరుడు, ''అలాగే జరుగుతుందిలే. కౌసల్యకు రాముడివై అవతరించి రావణదశ అంతం చేద్దువు గాని!'' అని అన్నాడు.

మళ్ళీ విష్ణువు, ''గజాననా! నీ ప్రసన్న వదనం చూస్తుంటే ఏనుగ అంటే మక్కువగా ఉందోయి!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''మొసలి బారి నుండి గజేంద్రుణ్ణి రక్షించి కరివరదుడు అనిపించుకుందువులే!'' అన్నాడు.

ఎనమండుగురు సిద్ధి కన్యలు చామర వింజామరాలు వీస్తూండగా, సింహాసనంపై సిద్ధి బుద్ధులతో చుక్కల్లో చంద్రుడి లాగ విఘ్నేశ్వరుడు ప్రకాశిస్తున్న ఆ సమయంలో, లక్ష్మి ముఖం తిప్పుకొని వెళ్ళిపోబోతూంటే విష్ణువు ఆమెను ఆపి, విఘ్నేశ్వరుడితో, ''సిద్ధివినాయకా! లక్ష్మి స్థిరమైనదికాదు అని వాదుపడుతున్నది. నీ ఒడిలో కాస్త కూర్చుండనియ్య! లక్ష్మికి స్థిరత్వం సిద్ధిస్తుందని ఆశిస్తున్నాను!'' అని అన్నాడు.

విఘ్నేశ్వరుడు మహానందంతో, ''తల్లి మహాలక్ష్మిని ఒడిపట్టే నా అదృష్టం ఎంత గొప్పది!'' అని అంటూ లక్ష్మి పాదాలను తొండంతో చుట్టి తన కుడి తొడ మీద కూర్చుండబెట్టుకొన్నాడు.

అప్పుడు విష్ణువు, ''ఇప్పుడు విఘ్నేశ్వరుడు 'లక్ష్మిగణపతి'. తల్లి కుమారుణ్ణి ఏవిధంగా కనిపెట్టుకొని ఉంటుందో అలాగే విఘ్నేశ్వరుడి అనుగ్రహం ఉన్న చోట లక్ష్మి స్థిరంగా ఉంటుంది,'' అని చెప్పాడు.

నారదుడు, ''ఓహో, విఘ్నేశ్వరుడికి ఎన్ని పేర్లు! సిద్ధివినాయకుడు, లక్ష్మిగణపతి, శుక్లాంబరధరుడు-ఇంకా ఎన్నో ఎన్నో'', అని అంటూ మహతివీణను వాయిస్తూ, ''జయ జయ జనగణనాయక జయహే!'' అని గానం చేస్తూ లోకాలన్నీ తిరిగాడు.

ఒకనాడు విఘ్నేశ్వరుడు ఎలుక వాహనంపైన ఆకాశమార్గంలో పయనిస్తూ



వింధ్య పర్వతశ్రేణిని దాటి, ఇంకా దక్షిణంగా వెళ్ళి ఒక పెద్ద నల్లని కొండ దగ్గిర దిగాడు. కొండ దిగువనే శబరులు డోళ్లు, డప్పులు కోలాహలంగా వాయిస్తూ పెద్ద సంబరం జరుపుకొంటున్నారు.

విఘ్నేశ్వరుడు తన రూపాన్ని ఉపసంహరించుకొని అందమైన కుర్రవాడి రూపంతో ఉత్సవాన్ని సమీపించాడు.

శబరులు కుర్రవాణ్ణి చుట్టుముట్టి, "దేవర తనకోసం మంచి చిన్నోడిని పంపినాడు!" అంటూ ఎత్తుకుపోయి ఉత్సవం మధ్యలో దింపారు.

అక్కడ రక్తపుచారలతో పెద్ద నల్లని గండశిల ఉన్నది. ఎదురుగా ఒక పసివాడు మూగగా ఏడుస్తూ ఉన్నాడు. ఆ పిల్లవాడి ఒంటి నిండా పసుపు రాసి, మొలకు నల్లని గుడ్డకట్టి, ఎర్రని మందార మాలతో అలంకరించారు.

విఘ్నేశ్వరుడు శబరనాయకుడితో, "మీ దేవరతో నేను మాట్లాడాలి, నన్ను అతని దగ్గిరికి తీసుకెళ్ళండి!" అన్నాడు.

శబరనాయకుడు పకపకా నవ్వుతూ, "బలే చిన్నోడివే! మా స్వామితోనే మాటలాడతావా? మా స్వామి కారు చీకటి లాగ మహాభీకరంగా ఉంటాడు. ఎవరూ చూళ్ళేరు. చూస్తే రక్తం కక్కుకొని అలాగే చచ్చిపోతారు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, తటాలున వెళ్ళి గండశిలను సమీపించి, "మీ భయాన్నే మీ స్వామికి అంటగట్టి భయంకరంగా ఉంటాడని అనుకుంటున్నారు. భయాన్నే భక్తి అంటున్నారు. మీలో ఉండే క్రూర స్వభావమే బలిగా తయారైంది. ఇదంతా తప్పు! మీరెవ్వరూ మీ స్వామిని చూసి ఎరగరు. మీ స్వామి ఎన్నడూ ఇలాంటి ఉత్సవాల్ని, బలినీ కోరలేదు. మీ స్వామి ఎంతో అందంగా ఇలాగ ఉంటాడు," అని చెబుతూ అరచేత్తో రాతిని తట్టాడు. నల్లని బండరాయి తెల్లని అరటిదవ్వ లాంటి అందమైన స్వామి విగ్రహంగా మారింది. ముణుకులపై చేతులు చాచి



కూర్చున్న స్వామి విగ్రహం నవ్వు ముఖంతో మనోహరంగా కనిపించింది. విఘ్నేశ్వరుడు పసివాడి తల నిమిరాడు.

ఆ పిల్లవాడు గొంతెత్తి, "స్వామీ, నీవే శరణం!" అంటూ విగ్రహం ముందు మోకరిల్లి స్తోత్రం మొదలు పెట్టాడు.

నల్లరాయిస్వామి విగ్రహంగా మారడమూ, మూగపిల్లవాడు గొంతెత్తి మాటలు పలకడమూ రెప్పపాటున జరిగాయి.

అద్భుతాలకు శబరులు నివ్వెరపాటుతో చేతులెత్తి, భయంభయంగా విఘ్నేశ్వరుడికి మ్రొక్కారు.

కుర్రవాడి రూపంతో ఉన్న విఘ్నేశ్వరుడు వారిస్తూ, "నన్ను కాదు మీరు మ్రొక్కవలసింది. మీ స్వామిని భయాన్ని విడిచి ప్రేమతో కొలవండి; మీరు నమ్మిన దేవరను తండ్రిలాగ, అన్నలాగ, స్నేహితుడి లాగ చూసుకోండి. బలులు మొదలైన చెడ్డపనులు మానేసి ఫలపుష్పాలతో, అరటి తోరణాలతో ఆనందంగా పండగలు చేసుకోండి. ఈ మాటలు వచ్చిన పిల్లవాడే మీకు గురువుగా, స్వామి పూజారిగా ఉంటాడు. నేను మీ స్వామి దగ్గరకు వెళ్తున్నాను. మీ స్వామి మీకు దర్శనమిస్తాడు!" అని చెప్పి చరచరా కొండను ఎక్కుతూ వెళ్ళాడు.

శబరులు కొంతవరకు అతనిని అనుసరించి వెళ్ళి ఆగిపోయారు.

విఘ్నేశ్వరుడు కుర్రవాని రూపంతోనే పర్వతాగ్రానికి చేరాడు. అక్కడ భైరవస్వామి తలవాల్చుకొని విచారంగా కూర్చుని ఉన్నాడు. అతని శరీరం కారునల్లగా ఉన్నది.

విఘ్నేశ్వరుడు పరుగున వెళ్ళి భైరవుణ్ణి రెండుచేతులా చుట్టి ఆలింగనం చేసుకొన్న క్షణంలోనే భైరవుడి శరీరం తెల్లగా వెన్నెలకాంతితో ప్రకాశించింది.

దివ్యమంగళరూపాన్ని పొందిన భైరవుడు కుర్రవాణ్ణి ఆనందంతో కౌగలించుకొని, "నీవు విఘ్నేశ్వరుడివి! నాకు తెలుసు. నీ అనుగ్రహంతో నా కారుదనం

పోయి దైవత్వం సిద్ధిస్తుందని నేను అవత రించినప్పుడు ఆకాశవాణి చెప్పింది. ఈ కొండ ఎక్కడానికి ఎవ్వరూ సాహ సించరు. నన్ను చూసి పక్షులు కూడా ధ్వని చెయ్యవు. నన్ను నేనే అసహ్యించు కొంటూ నీ కోసం ఎంతకాలంనుంచో నిరీ క్షిస్తూ ఉన్నాను. నీ నిజరూపంతో నా కన్నులకు విందు చెయ్యి!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు నిజరూపాన్ని పొంది అతనితో, ''ఇకనుండి నీవు దైవంగా ఆరా ధింపబడే స్వామివి! శివకేశవులిద్దరూ నీలో ఉన్నారు. నీ గురించి అమ్మ చెప్పి నప్పట్నించి నిన్ను కలుసుకోవాలని తహ తహ పడుతూనే ఉన్నాను. మోహం చీకటిలాంటిది! శివుడు మోహపరవశుడై జగన్మోహినీ రూపం ధరించిన విష్ణువు వెంటబడ్డాడు. శివ, విష్ణువుల తేజస్సులు ఒకటిగా కలసి నీ అవతరణం జరిగింది. అందువలన నీకు నల్లని రూపు వచ్చింది. ఇప్పుడు నీ అంత దివ్యమంగళ సుందరు డైన స్వామి వేరొకడు లేడు! శబరులకు ఒకసారి కనిపించు!'' అన్నాడు.

తరవాత కుర్రవాని రూపంతో శబరుల దగ్గిరికి వచ్చి, ''మీ స్వామి విగ్రహం ముందు మోకరిల్లి ఏకకంఠంతో 'స్వామీ! శరణం!' అని పిలవండి. మీ స్వామి మీకు కనిపిస్తాడు! పిలిచినప్పుడల్లా



పలుకుతాడు. పంటలు పండించండి. ఇళ్ళువాకిళ్ళు పల్లెలు కట్టుకొని సుఖంగా మనుష్యుల్లాగ జీవించండి. మీ స్వామి అండదండలెప్పుడూ మీకు రక్షగా ఉంటాయి. వెళ్ళండి!'' అని చెప్పి అదృశ్యమయాడు.

శబరులు నివ్వెరపోయి దణ్ణాలు పెట్టి, విగ్రహం దగ్గరకు చేరుకొని స్వామిని నోరారా పిలుస్తూ మ్రొక్కారు. దివ్య సుందరరూపంతో స్వామి వారికి సాక్షాత్క రించి చిరునవ్వులతో అభయముద్ర పట్టి వారిని ఆశీర్వదించి అంతర్ధానమయాడు.

అప్పటి నుంచి శబరులు ఏటేట మార్గ శిరమాసంలో అరటిచెట్టు బోదెను, లేత



ఆకును అనేక విధాలుగా ఉపయోగించి స్వామికి మంటపాలనూ, పందిళ్ళనూ అలంకరణచేసి, బలులు మొదలైనవి మాని సాత్వికారాధనతో స్వామిని భయం లేని భక్తితో అర్చిస్తూ, నాగరికులై విద్యావంతులై ఉన్నత మానవత్వాన్ని సాధించారు. స్వామి నివసించిన కొండపై గొప్ప ఆలయాన్ని శిల్పకళానిలయంగా నిర్మించి సంగీత నృత్యకవితలతో అలరించి గర్వించదగ్గ మానవజాతిగా రూపొందారు.

కుర్రవాని రూపంలో వచ్చిన దెవరో శబరులకు తెలియదు. వారి దేవర స్వామియే ఆ రూపంలో వచ్చి తమ అజ్ఞానాన్ని తొలిగించి అనుగ్రహించాడని అనుకున్నారే గాని విఘ్నేశ్వరుని లీల అని ఎరగరు. విఘ్నేశ్వరుడు అలాగ ఎరుకపడి ఉంటే విఘ్నేశ్వరుడే దేవుడని ఆరాధన మొదలుపెట్టి, తమ స్వామినే విస్మరించుతారని విఘ్నేశ్వరుడు అజ్ఞాత బాలకుడి గానే ఉండిపోయాడన్న సంగతి స్వామి పదేపదే తలంచుకొని మనసారా విఘ్నేశ్వరుణ్ణి స్మరిస్తూండేవాడు. కైలాసానికి వెళ్ళి విఘ్నేశ్వరునితో, కుమారస్వామితో ఆనందం పంచుకోవాలని ఉవ్విళ్ళూరేవాడు.

విఘ్నేశ్వరుడు శబరులను సంస్కరించి మూషిక వాహనుడై ఆకాశమార్గంలో క్రిందకు చూస్తూ ఉత్తరదిశగా తిరుగు ప్రయాణం చేస్తున్నాడు. కొండచరియలన్నీ కీకారణ్యాలతో నిండి ఉన్నాయే గాని భూమి అంతా బీడుపడిన మైదానం లాగ కనిపించింది. జలసమృద్ధి ఉంటే కనులపండుగగా పైరుపచ్చగా ఉండవలసింది కాని, నీటి కొరత తీర్చే నదులు లేక సౌభాగ్యశూన్యంగా భూములు వెలవెల పోతున్నవి. ప్రజలు ఆకాశాన్ని మబ్బుల్ని నమ్ముకొని ఏదో ఒకలాగ జీవయాత్ర సాగిస్తున్నారు.

"గంగమ్మ లాంటి నది కలిగిన ఉత్తరదేశ ప్రజలు ఎంత పుణ్యం చేసి పుట్టారో! అంత గంగ మనకు లేకపోయినా

అందులో ఒక పాయ మనకు ఏ దేవుడైనా కనికరించి ఇవ్వగూడదా? ముక్కోటి దేవుళ్లున్నారంటారు, ఎందుకూ? ఒక్కరికీ జాలిలేదు,'' అంటూ సామాన్యప్రజలు అనుకుంటున్న మాటలు వినిపిస్తూనే ఉన్నాయి విఘ్నేశ్వరుడి పెద్ద చెవులకు.

అటు పడమటి దిక్కున ఎత్తైన పర్వత శ్రేణులు, ఇటు తూర్పున చిన్న చిన్న కొండల బారుతో నిండి ఉన్న భూభాగాలు విశాలంగా తూర్పు సముద్రం వరకూ ఊరికే వున్నాయి. ఎక్కువమంది జనులు జంతువుల్నీ, పక్షుల్నీ వేటాడి తింటూ ఆటవిక జీవనం సాగిస్తున్నారు. సేద్యం మీద ఆధారపడ్డవారు అగచాట్లు పడుతూనే ఉన్నారు. సముద్రం మీద ప్రాణభీతి విడిచి చేపలుపట్టే జాలరులు విశేషంగా కనిపించారు. చాలీచాలని మేతతో పశుగణాలు బక్కచిక్కి దీనంగా కనిపించాయి. తూర్పు తీరం పొడవునా జాలరిపల్లెలే కనిపించాయి గాని మంచి ఊళ్ళు లేవు.

ఉత్తరభూమితో పోల్చి చూస్తే విఘ్నేశ్వరుడికి చాలా విచారం కలిగింది. హిమాచల సీమలో ఎటు చూసినా సుందర జలపాతాలతో, రమణీయ సరోవరాలతో, నదీ నదాలతో మనోహరంగా కనిపించే పచ్చని ప్రకృతి కళకళలాడుతూ ఆనందదాయకంగా ఉంటుంది. ఇక్కడ పడమటి పర్వతాలు దిష్టిబొమ్మల్లాగ బోడిగా ఉన్నాయి.

ఆ పర్వతశ్రేణి నడుమ సహ్యాద్రి చేరువనున్న లోయలో గౌతముడి ఆశ్రమం మసిబొగ్గుల్లో మరకతం లాగ ఆకుపచ్చగా మెరుస్తున్నది. విఘ్నేశ్వరుడికి ఏదో ఆలోచన వచ్చినట్లుగా తలపంకించాడు. ఎలుకను వేగం పెంచమని హెచ్చరికగా తట్టి దక్షిణాదిని, వింధ్యను దాటి ఉత్తరాదిని చేరుకున్నాడు. ఉత్తరభూమి దూరానికి అంతా ఏదో కొత్తగా ఉన్నట్టు కనిపించింది.

సమీపించేసరికి అక్కడ అంతా అయోమయంగా ఉంది.





# ఇద్దరు మోసగత్తెలు

## 9

జూరేక్ విచారం చూసి, హసన్ చిన్నగా నవ్వి, "తొందరపడకండి. మీకు డబ్బు సంచీ దొరుకుతుంది, పిల్లవాడూ దొరుకుతాడు. కాస్త మా వాడికీ, మీ మేనగోడలు జీనాబ్‌కూ పెళ్ళిముహూర్తం పెట్టించి మరీ వెళ్ళండి!" అన్నాడు.

"జీనాబ్‌ను అలీ కిచ్చి చెయ్యటానికి నా కేనాడూ అభ్యంతరం లేదు. కాని, జీనాబ్ సంతలో కొన్నట్టు కొనటానికి గొర్రెపిల్ల కాదు. దాన్ని పెళ్ళాడేవాడు భరణం ఇవ్వవలసి వుంటుంది," అన్నాడు జూరేక్.

"తప్పక ఇస్తాను, ఏమివ్వాలి?" అన్నాడు పాదరసం ఆత్రంగా.

"అజరయ్య కూతురు కమర్ దగ్గిర వుండే బంగారు దుప్పటీ, బంగారు శిరోభరణమూ, బంగారు వడ్డాణమూ, బంగారు చడావులూ తెచ్చిన వాణ్ణి చేసుకోవాలని జీనాబ్ అభిప్రాయం. అవి నువ్వు తెచ్చి ఇవ్వగలిగితే పెళ్లికి నా అభ్యంతరం ఏమీ లేదు," అన్నాడు జూరేక్.

"తెస్తాను," అన్నాడు పాదరసం అలీ.

జూరేక్ తన పిల్లవాణ్ణీ, డబ్బు సంచీని తీసుకు వెళ్లిపోయాక, హసన్ పాదరసంతో, "నీ కేమైనా పిచ్చా ఏమిటి? ఇటువంటి పని ఎందుకు మీద వేసుకున్నావు? అజరయ్య మంత్రాలూ, చేతబడులూ నేర్చినవాడు. వాడికి భూత పిశాచాలు పలుకుతాయి. వాడు బగ్దాద్ నగరం గోడల బయట, బంగారు వెండి ఇటుకలతో కట్టిన భవంతిలో వుంటాడు. రాత్రిపూట వాడు యింట్లో వున్నప్పుడు తప్ప ఆ ఇల్లెవరికీ కనిపించదు. పగలల్లా వాడు నగరంలో వడ్డీవ్యాపారం చేస్తాడు.

రాత్రివేళ ఇంటికివెళ్ళి కిటికీలో నిలబడి, తన కూతురి బంగారు దుప్పటి ఒక బంగారు పళ్ళెంలో పెట్టి పట్టుకుని, "ఇరాక్, ఇరాన్, అరేబియాలలో గల ఏ గజదొంగ అయినా సరే దీన్ని కాజెయ్యండి, చూస్తాం," అంటాడు. ఎంతమంది దొంగలో ఆ దుప్పటి కాజెయ్యటానికి యత్నించి నాశనమైపోయారు. వారిలాగే నిన్నుకూడా నాశనం చేయించాలనే దురుద్దేశంతోనే జురేక్ నిన్ను ఉసికొల్పాడు. ఈ పని నీ వల్ల అయేది మాత్రం కాదు!" అన్నాడు.

"ఏమన్నానో అన్నాను. జీనాబ్‌ను పెళ్ళికూతుర్ని చేసినప్పుడు ఆ బంగారు దుప్పటి కప్పి, బంగారు శిరోభరణం పెట్టి, బంగారు వడ్డాణం చుట్టి, బంగారు చడావులు తొడిగి మరీ పెళ్ళాడతాను!" అన్నాడు పాదరసం ధైర్యంగా.

వాణ్ణి ఎవరూ ఆపలేకపోయారు. వాడు అప్పుడే బయలుదేరి అజరయ్య దుకాణానికి వెళ్ళాడు. అజరయ్య బంగారాన్ని సంచులతో తూయించి, గాడిద మీద వేయిస్తున్నాడు. అజరయ్య దుకాణం మూసి గాడిదమీద సవారీ అయి ఇంటికి బయలుదేరేదాకా దూరంగా వేచి వుండి, అలీ అతన్ని వెంబడిస్తూ ఊరి వెలపలకు వెళ్ళాడు.

అజరయ్య ఒక చోటికి వచ్చి, సంచీలో నుంచి ఇంత ఇసుక తీసి, మంత్రించి, గాలిలో చల్లాడు. వెంటనే ఎదురుగా ఒక



భవనం ప్రత్యక్షమయింది. ఆ భవనం బంగారు ఇటుకలతో, వెండి ఇటుకలతో కట్టివున్నది. అజరయ్య గాడిదమీద భవనంలో ప్రవేశించాడు. మరి కొంత సేపటికి అయన కిటికీ తెరిచి, చేతిలో బంగారు పళ్ళెంలో బంగారు దుప్పటి పెట్టి పట్టుకుని నిలబడి, ''ఇరాక్, ఇరాన్ అరేబియాలలో గల గజదొంగల్లారా! చాతనయితే ఈ నా కూతురి సొత్తు దొంగిలించి ఆమెను పెళ్ళాడండి!'' అన్నాడు.

అజరయ్యను మంచిగా అడిగి ఆ వస్తువులను బహుమానంగా పుచ్చుకోవాలని అలీకి తోచింది. ''అయ్యా, తమతో ఒక్కసారి మాట్లాడాలి,'' అన్నాడతను అజరయ్యతో.

''ఎవరు నువ్వు? పైకి రా!'' అన్నాడు అజరయ్య.

పాదరసం పైకి వెళ్ళి అజరయ్యతో తన అవసరం గురించి చెప్పాడు. అజరయ్య అంతా విని గట్టిగా నవ్వి, పాదరసం చెయ్యి పరీక్షించి, ''నీకు ప్రాణంమీద ఆశ వుంటే, నా సలహా తీసుకుని, ఈ ప్రయత్నం మానుకో. ఎవరో నీ కీడు గోరి నిన్ని పనికి పురికొల్పారు. నా ఆయుర్దాయం కంటె నీకు ఎక్కువ వున్నది. లేకపోతే నిన్ను ఈ క్షణాన చంపి వుందును!'' అన్నాడు.

అలీ మండిపడి, కత్తిదూసి, ''దుర్మార్గుడా! నేను కోరినది ఇవ్వకపోతే నిన్ని క్షణంలో చంపేస్తాను!'' అన్నాడు.





"ఆ చెయ్యి పడిపోవాలి!" అన్నాడు అజరయ్యా. మరుక్షణం పాదరసం కుడి చెయ్యి చచ్చుపడిపోయింది. పాదరసం కత్తిని ఎడమచేతిలోకి తీసుకున్నాడు. కాని అజరయ్యా మహిమవల్ల అదీ పడిపోయింది.

"ఇప్పటికైనా నీ ప్రయత్నం మానుకుంటావా?" అన్నాడు అజరయ్యా.

"నాకా దుప్పటీ అవీ కావాలి!" అన్నాడు పాదరసం.

"అందుకు ఒకటే మార్గం! గాడిదవై వాటిని మొయ్యి!" అంటూ అజరయ్యా పాదరసం మీద నీళ్ళుమంత్రించి చల్లాడు. వెంటనే అలీ కాస్తా గాడిద అయిపోయాడు.

మర్నాడు అజరయ్యా దుకాణానికి పాదరసాన్ని తోలుకుపోయాడు. ఆ రోజు సాయంకాలం ఇంటికి వచ్చాక అజరయ్యా అలీని మళ్ళీ మనిషిని చేసి, "ఎందుకు చెడతావు? నా సలహా విని వెళ్ళిపో, లేకపోతే ఇంకా హీనమైన జంతువుగా మార్చగలను," అన్నాడు. అలీ ఆ మాటలేవీ వినిపించుకోక అజరయ్యా మీదికి వురికాడు. అజరయ్యా అతన్ని ఎలుగుబంటిగా మార్చేశాడు.

మర్నాడు అజరయ్యా కూతురు కమర్ తండ్రితో, "నాన్నా, ఈ అబ్బాయి నన్ను పెళ్ళాడతాడేమో అడుగు," అన్నది.

"నువే అడుగు," అంటూ అజరయ్యా కోపంగా తన గదిలోకి వెళ్ళాడు.

"నీకు కావలసింది నేనా, నా వస్తువులా?" అని కమర్ పాదరసాన్ని ప్రశ్నించింది.

"దిలైలా కూతురు జీనాబ్ అనే అందగత్తెకు భరణంగా ఇవ్వటానికి నీ వస్తువులే నాకు కావాలి," అన్నాడు పాదరసం అలీ.

"వాడి మనసు మారదు, చూశావా?" అన్నాడు అజరయ్యా కూతురితో. తరవాత అలీ మీద నీళ్ళుచల్లి కోతిని చేశాడు.

ఆ రాత్రి కమర్ ఒక నిశ్చయానికి వచ్చేసింది. ఆమె పాదరసం అలీకి

సహాయం చెయ్య నిశ్చయించింది. అతను తనను పెళ్ళాడకపోయినా అతని సుఖం కోసం తన వస్తువులు ఇచ్చెయ్య దలచింది. అందుచేత ఆమె ఆ రాత్రి, తన తండ్రితో శతపోరి అత్తణ్ణి ఒప్పించింది. తరవాత తన వస్తువులన్నీ బంగారు పళ్ళెంలో పెట్టుకుని, కోతి రూపంలో వున్న పాదరసం దగ్గిరికి పోయి, అతన్ని మనిషిగా చేసి, "అలీ, ఇవి తీసుకో! నువు కోరే జీనాబ్‌ను పెళ్ళాడు," అన్నది.

పాదరసం అలీకి కమర్ పట్ల చాలా అభిమానం కలిగింది. అతను ఆమెను వెంటబెట్టుకుని హసన్, అహ్మద్‌ల వద్దకు వెళ్ళాడు. "నువు జీనాబ్‌ను పెళ్ళాడిన తరవాత కమర్‌ను కూడా పెళ్ళాడటం ఉచితం. ఈమె తండ్రి కీమె ఒక్కతే కుమార్తె గనక అతని ఆస్తి కూడా అతడి తదనంతరం చట్టం ప్రకారం నీకే దక్కుతుంది," అని వారు అన్నారు.

తరవాత వాళ్ళు దిలైలానూ, జీనాబ్‌నూ, జురేక్‌నూ పిలిపించారు. జురేక్ సాక్షిగా పాదరసం జీనాబ్‌కు కమర్ బంగారు దుప్పటీ, శిరోభరణమూ, వడ్డాణమూ, చడావులూ భరణంగా ఇచ్చాడు. జురేక్, తన మేనకోడలైన జీనాబ్ పాదరసం అలీని పెళ్ళాడటానికి ఒప్పుకున్నాడు.

ఈ భరణం సంపాదించటానికి పాదరసం పడిన కష్టాలను గురించి విని జీనాబ్, అలీ కమర్‌ను పెళ్ళాడటానికి ఆమోదించింది. పాదరసం అలీకీ, జీనాబ్‌కూ పెళ్ళి అతివైభవంగా జరిగింది.

తరవాత కొద్ది రోజులకు పాదరసం ఖలీఫా దర్శనం చేసుకుని తనను కొలువులో ఉంచుకోమని అర్జీ పెట్టుకున్నాడు. ఆ అర్జీని ఇద్దరు కొత్వాళ్ళూ, పావురాల టపా నిర్వాహకురాలూ బలపరచటం వల్ల ఖలీఫా పాదరసం అలీని రాజభటులకు సర్దారుగా నియమించాడు. నెలకు వెయ్యి దీనారాలు వేతనం తీసుకుంటూ పాదరసం జీనాబ్, కమర్‌లతో సుఖంగా కాలం గడిపాడు.

—(అయిపోయింది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Devidas Kasbekar

N. Sivannarayana

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ సెప్టెంబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## జూలై నెల పోటీ ఫలితాలు

*మొదటి ఫోటో : నిరుపేద వృత్తి*

*రెండవ ఫోటో : నిర్మల భక్తి*

పంపినవారు : జి. లిజ్నాకుమారి, తాళ్ళపల్లి. (గుంటూరు జిల్లా)

*బహుమతి మొత్తం రు. 25/—నెలాఖరులోగా పంపబడుతుంది.*

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

మేమందరం గోల్డ్‌స్పాటర్స్

# వారెవ్వా!
# వహ్వా!
# ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!

Fun means Goldspotting



Gold Spot

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.

**గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!**

TRIKAYA-GS-5-80-TEL

రామ్; శ్యామ్

# మోసపోకండి!

రామ్, శ్యామ్ ఓ తీర్థానికెళ్ళొస్తూండగా చూసారు ఓ పిల్లల జోడీ ఏడుస్తూండగా

























పార్లే పాపిన్స్ మజాగా నోట్లో వేసుకునే ముందర వెండిచారలకోసం చూడండి.
ఇప్పుడు నకిలీచేసేవాళ్ళు మిమ్మల్ని మోసం చేయలేరిక.

everest/81/PP/102-tl